# బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్

# 3 తరాల వారికి అదే కమ్మని రుచి



గ్రీన్ లేబిల్ : అనేక సం॥ల గా బామ్మగారు దాన్ని ఉపయోగిస్తున్న విధం



గ్రీన్ లేబిల్ : అమ్మ దాన్ని ఉపయోగిస్తున్న విధం



అదే గ్రీన్ లేబిల్ : మీరు మెచ్చుకొనే విధం మరియు మీరు ఉపయోగించే విధం

మూడు తరాల వారికి అభిమాని కావడంలో ఆశ్చర్య పడనవసరం లేదు. మరియు ఈ రోజు అందుకే అధికంగా అమ్ముడవుతుంది




**ఎల్లప్పుడూ శ్రేష్ఠమైనది, స్ట్రాంగైనది**

OBM-5709 A/1 TEL

## ✻ లోకం పోకడ ✻











**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]

శుక్రవారం : 1–12–'78
కాళయుక్తినామ సం. మార్గశిర శు. పాడ్యమి
*సంపుటము 72 : సంచిక 12*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41–60
ఆరు మాసాల చందా రు. 20–80
విడి ప్రతి వెల 75 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520 003


## విషయ సూచిక

అట్టమీద బొమ్మ : శ్రీ ... 'లో అక్కినేని నాగేశ్వరరావు




## ముఖచిత్రం

10-11-78 శుక్రవారం అనే పేరుతో వెలువడిన పత్రిక ముఖచిత్రము ఎన్.టి.ఆర్., జయసుధ, దీపావళి సంచికకు తగినట్లుగానే ఉన్నదని చాలా వరకు చెప్పవచ్చును. కథలు కూడా బాగానేయున్నవి. కార్టూన్స్ ఫరవా లేదు.

నారాయణశెట్టి గౌరీశంకరరావు. బ్రదర్స్. [నడిమికెళ్ల.]

## బొమ్మల మహాభారతం

"బొమ్మల మహాభారతం" కథను దీపావళి సంచికనుండి ప్రారంభించినందులకు మీకు నా ధన్యవాదములు. శ్రీ మండపాక సీతారామాంజనేయులుగారికి కృతజ్ఞతలు. "హిడింబ బకాసురుల వధ" బొమ్మల కథ చూడముచ్చటగావుంది. మా పిల్లలు ఎంతో ఆసక్తిగా చదవటమేగాక, ఈ బొమ్మల కథలను, వేరే జాగ్రత్త పరుస్తున్నారు.

ఎమ్.ఎ.ఆర్. సోమయాజులు. [నాగపూర్.]



## పొరపాటు

10-11-78 ఆంధ్ర పత్రిక వార పత్రిక సంచికలో ప్రచురింపబడిన "భోజనం" (బహుమతి పొందిన) కథలో చిన్నతప్పు దొర్లింది 39 పేజీలో, 26వ లైను వాక్యంలో "తండ్రి" బదులు "తిండి" అని చదువుకోవాలి.

రచయిత

## దీపావళి సంచిక

మీ (మా) అభిమాన ఆంధ్ర పత్రిక వార పత్రిక దీపావళి సంచిక యందు మీరు ప్రచురించినటువంటి కథలు మరియు అందులో బహుమతి పొందిన కథలు మమ్ములను ఎంతగానో సంతోష పరచినవి ఈ సంచికలో "ఫాలాక్షుని డైరీ" మమ్ములను ఎంతో సంతోష పరచినందులకు ఆంధ్ర పత్రిక వార పత్రిక సంపాదక వర్గమునకు మా ధన్యవాదములు.

సి. వీరాంజనేయులు, ఎం. హేమాలయ్య, కె. నాగేశ్వరరావు, పేవి సరిత, పేవి అరుణ, [కడప.]

## ధర్మపథం

ధర్మపథం శీర్షికలో బులుసు రమణయ్యగారు మద్యపానం గురించి విపులంగా వ్రాశారు. మద్యం సేవిస్తే ఎలాంటి అపనిందలకు గురి అవుతారో, ఉదాహరణకు బలరాముని ద్వారా నిరూపించారు. వారికి మా అభినందనలు

టి. రవీంద్రనాథ్. [అనంతపురం.]

## సీరియల్

దీపావళి సంచిక "దివినుండి భువికి" ముఖ చిత్రము చూడముచ్చటగా ఉంది. ఇకపోతే సీరియల్స్‌లో "ఆకర్షణ-వ్యామోహము" ముందుగానే మమ్ములను ఆకట్టుకుంది. ఫాలాక్షుని డైరీలో మాకు తెలియని ఎన్నో విషయాలు తెలియజేయుచున్నందుకు మీకు మా కృతజ్ఞతలు. ముఖచిత్రములో బాలనటుల ఫోటోలు కూడ వేస్తే బాగుంటుంది.

జి. బాబు. [ఎయిర్ ఫోర్స్ అకాడమీ.]

* * *

దీపావళి సంచికలో శ్రీ కవనశర్మగారి "ఆకర్షణ - వ్యామోహం" సీరియల్ ఆసక్తిదాయకంగా వుంది. సూట్‌కేసుకోసం ప్రొఫెసర్ విమానాశ్రయానికి వచ్చి చేసిన ప్రయత్నం. పామును బయటికి చేరవేసిన పోర్టరు కాలి అడక్కపోవడం మొదలైన ఆస్ట్రేలియన్ల నాగరికతను తెలియజేసే విషయాలు ఆసక్తి కలిగించాయి.

మినిస్కర్ట్సు వేసుకునేవారు, మన వాళ్ల వస్త్రాలంకరణ సంప్రదాయం ఎక్కువగా వుంచుకోడం నవ్వు తెప్పించింది.

తన సహజ వ్యంగ్య ధోరణిలో నవల అందిస్తున్న కవనశర్మగారికి అభినందనలు.

లతిక, [విశాఖ]

(50 వ పేజీ చూడండి)

సీరియల్

# రాగద్వేషాలు

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

(గత సంచిక తరువాయి)

శ్రీకర్ వాళ్ళు వెళ్ళాక రావుగారు ఇందిరతో అన్ని విషయాలూ చర్చించారు. కలకత్తాలో వున్న కొన్ని కంపెనీలలోని షేర్లు అమ్మేయడానికి నిశ్చయించుకున్నారు. తాము వెళ్ళి సెటిల్ కావడానికి హైదరాబాద్ అయితే బాగుంటుందనుకున్నారు. ఇందిరకి వ్యాపార వ్యవహారాల్లోని లావాదేవీలు వివరించారు.

"నువ్వుకూడా ఇంకనించీ 'ఆక్టివ్‌పార్ట్' తీసుకోవాలమ్మా–ఈ విషయాల్లో. ఇప్పుడు మనం స్టార్ట్ చెయ్యబోయే ఇండస్ట్రీ నీకు తెలిసిందేగా? నువ్వు చదివిందే–కంప్యూటర్ కోర్సు–నీకు ఇంటరెస్టింగ్‌గా వుంటుంది కూడా!"

"ఎప్పుడూ జరిగిన దానికి విచారిస్తూ–మనసును కలత పెట్టుకోవద్దు తల్లీ! బాబు కూడా స్కూలుకు వెళ్తున్నాడు కాబట్టి నీ మనసు మరో వైపుకు మళ్ళించుకుంటే కాస్త మనశ్శాంతి వుండమ్మ! కదూ?"

ఇందిర తండ్రితో ఏకీభవించింది. మరో వారం పదిరోజులకి శ్రీకర్ తిరిగివచ్చాడు. శ్రీలతని కొన్నాళ్ళు పుట్టింట్లో–వాళ్ళ వాళ్ళ దగ్గిర వుండమన్నాడు.

శ్రీలత కూడా తన వాళ్ళని చూసి మూడేళ్ళపైనయింది. అందుకే కొన్నాళ్ళు తన వాళ్ళతో గడపదల్చుకుంది! తాము పెట్టబోయే ఇండస్ట్రీ గురించి శ్రీకర్–రావుగారు చర్చించుకునేటప్పుడు – ఇందిర కూడా పాలు పంచుకుంది.

హైదరాబాద్ అయితేనే బావుంటుందని శ్రీకర్‌కూడా అన్నాడు. హైదరాబాద్‌దగ్గిర జీడిమెట్ల–సనత్‌నగర్–పటంచెఱువు అనే ప్రదేశాల్లో ఇండస్ట్రియల్ ఎస్టేట్స్ వున్నాయనీ. వీటిల్లో ఎక్కడైనా బానే వుంటుందనీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వీటికి సబ్సిడీ, లోను, కావలసిన సదుపాయాలన్నీ కూడా చేస్తుందనీ చెప్పారు రావుగారు.

ఆ తరువాత వారం రోజుల్లోనే రావుగారు, శ్రీకర్‌లు వెళ్ళి ఆయా ప్రదేశాలు చూసి వచ్చారు– హైదరాబాద్‌లో పటంచెఱువు దగ్గిరైతేనే బావుంటుందని నిర్ణయించుకున్నారు.

తాము ఉండడానికి 'బంజారా హిల్స్'లో

*జరిగినకథ 17.* అధికారి హనుమంత రావుగారు వివాహమాడిన బెంగాలీ యువతి గీత, ఇందిరను కనిన కొంతకాలానికి మరణిస్తుంది. ఆయన అక్క సుగుణ తన కొడుకు ఫారిన్ రిటర్న్‌డ్‌ను ఇందిరకు ఇచ్చుటకు ఆమె అత్తమామలు నిరాకరించారని ఉత్తరంలో విచారం వెలిబుచ్చుతుంది. ఇందిరను చేసుకునే విషయములో విశ్వనాథం వ్రాసిన ఉత్తరం హనుమంతరావుని గుండె పోటుకు గురిచేయగా, ఆయన కుమారుడు శ్రీకర్ వ్రాసిన ఉత్తరం ఊరట కల్గిస్తుంది. హనుమంతరావుగారు ఇందిరకి వేరే సంబంధాలు చూస్తుంటారు. అమెరికాలో ఉద్యోగం చేస్తున్న ఆనంద్‌తో ఇందిరకు ఘనంగా వివాహం జరిపిస్తారు రావుగారు. కాపురానికి కావలసిన అన్ని వస్తువులూ ఇచ్చి, ఇందిరను అత్తవారింటికి పంపుతారు. దురదృష్టవశాత్తు తుఫాను భీభత్సంలో తల్లిదండ్రులను కోల్పోయిన అల్లుణ్ణీ, కూతుర్నీ తనింటికి తెస్తారు రావుగారు. ఇందిర తండ్రిని ఒంటరిగా వదిలివేసి ఆనంద్‌తో అమెరికా వెళ్ళిపోతుంది. 'నాన్సీ' స్నేహితుని భార్య అని చెప్పి యిందిరను ఆమె యింటికి చేరుస్తాడు. నాన్సీ, ఆనంద్‌ల ప్రవర్తనను ఏవగించుకున్న ఇందిర, వేరే ఇల్లు చూపమని శ్రీకర్‌ని అర్థిస్తుంది. నాన్సీ తన భార్యేననీ, ఇందిర ఆమెకు ఊడిగం చేయక తప్పదని చెప్పిన ఆనంద్‌ను ద్వేషించి బయటికివచ్చేస్తుంది ఇందిర. శ్రీకర్–ఇంటికి వచ్చిన ఇందిరకు, శ్రీలతతో తనకు ఎలా వివాహం జరిగిందీ వివరిస్తుంటాడు. అమెరికాలోని ఒక వ్యక్తి శ్రీలతను ప్రకటనద్వారా వివాహమాడి ఎట్లా మోసం చేసిందీ శ్రీకర్ ఇందిరకు చెప్తాడు. కంప్యూటర్ కోర్సులో చేరిన కొన్నాళ్ళకు తాను గర్భవతినని తెలుసుకొని 'అబార్షన్' చేయించు కోవాలనుకున్న ఇందిరను వారిస్తారు శ్రీకర్, శ్రీలతలు. పుట్టింటికి రమ్మని తండ్రి వ్రాసిన ఉత్తరం చూసుకొని ఎటూ తేల్చుకోలేని స్థితిలో ఉంటుంది ఇందిర. తండ్రి దగ్గరకు వచ్చిన ఇందిరకు పురుడు పోయటానికి వచ్చిన సుగుణ. కోడలి మరణ వార్తవిని తిరిగి వెళ్తుంది. ఆనంద్, ఇందిరలమధ్య భేదాభిప్రాయాలు పసికట్టిన రావుగారు వాస్తవం తెలియ జేయమని ఇందిరను అడుగుతారు. ఇందిరకొడుకు 'శ్రీనివాస్' చేసే అల్లరిపనులను చూస్తూ తమదుఃఖాన్ని మరిచిపోయేతరుణంలో, శ్రీకర్‌నుండి ఇండియా తిరిగివస్తున్నట్లు ఉత్తరం వస్తుంది. ఇండియాకు తిరిగి వచ్చిన శ్రీకర్ ఒక ఇండస్ట్రీ స్థాపించాలనుకుంటున్న సమయంలో తనతో పార్ట్‌నర్‌గా కలవమంటారు రావుగారు.



పెద్ద బంగళా ఒకటి కొన్నారు. అది అన్నపూర్ణా స్టూడియోస్‌కి దగ్గిరగా వుంది. బంగళా కొనబోయే ముందు ఇందిర కూడా వెళ్ళి చూసి చాలా బావుందని మెచ్చుకుంది.

త్వరత్వరగా పనులు ప్రారంభించారు. కలకత్తాలో షేర్లన్నీ అమ్మేశారు. తమ స్వంత ఫ్యాక్టరీలు మాత్రం అమ్మలేదు.

అన్ని పనులూ శ్రీకర్ స్వయంగా చూసుకుంటున్నాడు. శ్రీకర్ రావుగారితో తను కలకత్తా వచ్చి అక్కడి బిజినెస్ వ్యవహారాలన్నీ చూసుకుంటాననీ, ఇంకనించీ ఆయన తిరగక్కరలేదనీ అన్నాడు.

"మీరు హైద్రాబాద్‌లోనే వుండండి. అత్యవసరమైతేనే తప్ప అక్కణ్నించీ కదలద్దు మీకు కావల్సిన పనులన్నీ, వ్యాపార సంబంధమైన విషయాలన్నీ నేను చూసి పెడతాను మీలాంటి అనుభవజ్ఞుల కింద పని చెయ్యడం నాకు మహద్భాగ్యం. అది నిజంగా అదృష్టం' అన్నాడు శ్రీకర్.

రావుగారు ఆప్యాయంగా అతడి భుజం తట్టారు. 'శ్రీ ఎలక్ట్రానిక్స్' అని పేరు పెట్టి ఇచ్చారు వాళ్ళ ఇండస్ట్రీకి.

హైద్రాబాద్‌కి షిఫ్ట్ అవడానికి ప్రయత్నాలు ప్రారంభించారు రావుగారు-ఇందిర!

## 26

రావుగారు కలకత్తా వదిలేస్తున్నారన్న వార్తవిని బంధువులు-స్నేహితులు చూడడానికి వచ్చి వెళ్తున్నారు. కొంతమంది విచారిస్తున్నారు. కొన్ని సంవత్సరాలుగా వుండిపోయిన వాళ్ళు కావడంచే, ఆయన పెద్ద బిజినెస్‌మాన్ కావడంచేత దాదాపు కలకత్తా అంతా తెలుసాయనకి! కలకత్తాలో ప్రముఖ వ్యక్తులంతా ఆయన పరిచయస్తులే! ఆయనకీ కలకత్తా వదలాలంటే బాధగానే వుంది! తనవివాహమయినది మొదలు ఇక్కడే వున్నారు! వివాహ జీవితం అంతా ఇక్కడే గడిచింది! తన భార్య స్మృతులన్నీ ఇక్కడే వున్నాయి!

తన జీవితంలో ముఖ్య ఘట్టాలు -కష్టాలు-సుఖాలు-అన్నీ ఇక్కడే అనుభవించారు! తల్చుకుంటే విచారంగానే వుంది! కానీ ఆయన చిరకాల వాంఛ — తన చివరి రోజులు ఆంధ్రదేశంలో గడపాలని! అందుకే వెళ్తున్నారు గూడా! వీడ్కోలు పార్టీలు — భోజనాలు- ఎక్కువయ్యాయి. పార్టీలకి వెళ్ళాలంటే మహా విసుగ్గా వుంది-ఇందిరకి. ఇంట్లో సర్దాల్సినవి చాలా వున్నాయి. బాబు ఏ పనీ చెయ్యనీయడం లేదు. వాడి అల్లరి చాలా ఎక్కువయింది. ఆరోజు ఎందుకో ఇందిరకి ఏ పనీ చెయ్యబుద్ధి కావడంలేదు. బాబుతో ఆడుతూ కూచుంది. ఉత్తరాలు వచ్చాయి. బాబు అందుకుని — ఇందిర కిచ్చాడు. వాటిల్లో... ఇందిరకి — ఉత్తరం ఒకటుంది! అది—అది...ఆనంద్ రాసింది! చదవద్దనుకుంటూనే చించి చదివింది-ఇందిర!

"మైడియర్ ఇందూ— నన్ను మర్చిపోలేదు కదూ? నువ్వు మర్చిపోవు. నాకు తెలుసు! నామీద కోపంగా వున్నావు కదూ? అవును. సహజమే — మరి! నేను చాలా పాపం చేశాను. నీకు ద్రోహం చేశాను. దానికి నన్నేం చేసినా పాపం లేదు. నువ్వన్నట్టు! నీ ఇష్టంవచ్చిన శిక్ష విధించు. నేను భరిస్తాను!

నీ ప్రేమ విలువెంతో నాకు తెలిసి వచ్చింది. నువ్వు దేవతవు ఇందూ! నేను జరిగినదానికి చాలా బాధ పడుతున్నాను. పశ్చాత్తాప పడుతున్నాను. నువ్వు నమ్మలేవు కదూ? కానీ నన్ను చూస్తే నువ్వే నమ్ముతావు. నేనిప్పుడు ఇదివరకటిఆనంద్‌నికాదు! ఆ ఆనంద్ చనిపోయాడు. నేను మళ్ళీ జన్మ నెత్తాను. నీకోసమే ఇందూ! నీపాదాలు నా కన్నీటితో అభిషేకిస్తేగాని నేను చేసిన దానికి నిష్కృతిలేదు. నా హృదయానికి శాంతిలేదు! ఇవి నాహృదయంలోంచివచ్చిన మాటలు!

నా కళ్ళకున్న పొరలు తొలిగిపోయాయి.

నుంచేదో - చెడేదో తెలుసుకోగలిగాను. నా క్కిప్పుడు నువ్వు తప్ప 'నా' అనే వాళ్ళెవరూ లేరు. ఉన్నా అక్కరలేదు నాకు ఆత్మీయత కావాలి ప్రేమించే హృదయం కావాలి! నీది క్షమా హృదయం. జాలిగుండె. వెన్నలాంటి మనసు–నాకు తెలుసు!

నన్ను నువ్వెప్పుడూ కాదనవు. నాకు తెలీదూ? అన్నట్టు మనకో 'బాబు' ఉన్నా డుటకదా? ఎట్లా వున్నాడు? ఎవరి పోలిక? వాణ్ని చూడాలని నా మనసు ఆత్రుత పడుతోంది.

వాళ్ళ విషయం రాస్తున్నాను. నిన్నూ–వాడినీ చూడాలని నేను ఇండియా వస్తున్నాను. అమెరికా వదిలేసి వస్తున్నాను! నన్ను నువ్వు తృణీకరించవన్న ధైర్యంతోనే వస్తున్నాను. ఇంక నీదగ్గిరే వుండిపోతాను. నిన్నింకే విధంగానూ అన్యాయం చెయ్యను. నీ దాసాను దాసుడిని! నామీద కాస్త దయ చూపించు!

నేను నిన్ను పెట్టిన బాధలకి అంతకు రెట్టింపునన్ను బాధపెట్టినానాకుసంతోషమే! ఆనందంగా భరిస్తాను. కానీ...కానీ ఇంకెప్పుడూ నన్ను మాత్రం నీకు దూరం చెయ్యకు–ప్లీజ్.. వచ్చే రోజు ఎప్పుడో ఎగ్జాక్ట్‌గా రాస్తాను. బాబుతో ఎయిర్ పోర్టుకి వస్తావుగా? నన్ను నిరాశ పరచవని ఆశిస్తాను. మీ నాన్నగారికి నా న మ స్కా ర ము లు, ఉంటాను? నీ దాసుడు,

ఆనంద్."

ఆ ఉత్తరం చదువుతూ వుండగానే రావుగారు వచ్చారు.

మౌనంగా తండ్రికా ఉత్తరం అందించి లోపలికి వెళ్ళిపోయింది ఇందిర!

ఆశ్చర్యంగా చూశారు ఇందిర వెళ్ళిన వైపు! ఉత్తరం తెరిచారు! అరె- ఆనంద్ ఉత్తరం అది! గబుక్కున మూసేశారు చదవకుండా! ఉత్తరం చేత్తో పట్టుకుని కూతురి వద్దకు వచ్చారు. "ఇది...ఇది..."

"చదవండి నాన్నా..." అన్నది ఇందిర ఉద్వేగాన్ని అపుకుంటూ!

ఉత్తర మంతా చదివాక నెమ్మదిగా కూతురి దగ్గిరగా వచ్చారు.

ఇందిర హృ ద య ం అల్లకల్లోలంగా వుంది!

ఆమె తలని తన హృదయానికి ఆనించుకున్నారు రావుగారు.

# రాగద్వేషాలు

"అమ్మా ఇందూ- ఆవేశం వద్దు. నెమ్మదిగా ఆలోచించి తీసుకో ఏ నిర్ణయమైనా సరే! దీంట్లో బలవంతమేమీలేదు. నువ్వు ఏ నిర్ణయం తీసుకున్నా నాకు సంతోషమే–సమంజసమే! దానికి పూర్తిగా నా మద్దత్తు వుంటుంది. నా బలం వుంటుంది! చలనం లేని రాయిలాగా వుండిపోయింది ఇందిర. ఇందిరనింక కదిలించకుండా నిశ్శబ్దంగా బయటికి నడిచారు.

ఆమె మనస్థితి నాయన ఊహించగలరు! అందుకే ఆరోజంతా ఎవరూ ఇందిరని డిస్టర్బ్ చెయ్యకూడదని ఆదేశించారు. పిల్లవాడు కూడా ఆమె దగ్గిరికి రాలేదు! దీర్ఘంగా ఆలోచించింది ఇందిర! రాత్రి నిద్ర కూడా పోకుండా, అన్నం కూడా తినకుండా ఆలోచించింది! ఏమిటి తనకర్తవ్యం? జరిగిందంతా కళ్ళముందు కదిలింది. తనకు జరిగిన అవమానం సామాన్యమయినదా? చిత్రహింస ఒక జన్మకి కాదు — పది జన్మ లయినా తను మర్చిపోగలదా?

హానీ చేసినదంతా మోసమే అయినా — తనకు ద్రోహమే చేసినా, తనతో మంచిగా మాట్లాడి తనని సరిగా ట్రీట్ చేశాడా? తోటి ఆడదాని ముందు నిట్టా అవమానించాడు? తరువాత అన్ని నెలలు తను అమెరికాలోనే వుంది. ఒక్కనాడైనా తనేమైందో అని ఆలోచించాడా? పైగా...పైగా శేఖర్ కనిపించినప్పుడల్లా... వింత నీచంగానో... మాట్లాడేవాడట!

అసలా ఉత్తరంలో రాసిందంతా నిజమేననీ–మారాడనీ ఎట్లా నమ్మడం? అంత చక్కగా నటించ గలిగిన వాడు — అంత నీచంగా మోసగించిన వాడు వింతకైనా తగుతాడు! ఏదైనా చేస్తాడు!

అప్పుడు అతడన్న మాటలు తను మర్చిపోలేదు. దేశంకాని దేశంలో నిస్సహాయురాల్ని చేసి బయటికి వెళ్ళగొట్టాడు. తన గతే మవుతుందని గూడా ఆలోచించ లేదతడు! తన మీద అసలు ప్రేమలేదు. అవన్నీ తల్చుకుంటే ఇప్పటికీ అతడంటే ద్వేషం–కసి కలుగుతున్నాయి! ఎదురుగా...ఎదురుగా కనబడితే అతణ్ని హత్యయినా చెయ్యాలి, లేదా తనన్నా ఆత్మహత్య చేసుకోవాలి! అంతేకానీ ఈ జన్మలో అతడి ముఖం ఇంక తను చూడలేదు! అతడితోకలిసి వుండడం కల్ల!! అతణ్ణి జన్మకి క్షమించలేదు తను! దగ్గిరికి చేర్చి కోరి– కొరివితో తలగోక్కో లేదు తను! తనకు తనే హాని చేసుకోలేదు. ఇంకోసారి మోసపోలేదు. తనని తను మోసం చేసుకుంటూ గడపలేదు. తన ఈ జీవితమే తనకుచాలు. ఇంక అతడితో తనకే సంబంధము లేదు— వుండదు- అతడికి... అతడికి అట్లాగే బుద్ధి రావాలి–!

అడదంటే ఆటబొమ్మ అను

---

# నడుస్తూనే డయాలిసిస్!

కృత్రిమమైన మూత్ర పిండాలను తయారు చేయడమే కాకుండా వాటిని వాడటంలో అతిసులువైన పద్ధతిని జపానులో కనిపెట్టారు: ప్రస్తుతం ప్రపంచంలో వున్న పద్ధతిని అనుసరించి రక్తాన్ని పరిశుద్ధ పరచాలంటే డయాలిసిస్ పద్ధతిని అనుసరించాలి. పెద్ద పెద్ద ఆస్పత్రుల్లోగాని యీ సౌకర్యము లభించదు. పైగా 100 మొదలుకుని 150 లీటర్లు డయాలిసిస్ లిక్విడ్ కావలసి వుంటుంది. పైగా పెద్ద యంత్ర సామగ్రి వుండాలి. ఇటువంటి సౌకర్యాలు బహుకొద్ది ఆ స్ప త్రు ల లో వుంటాయి.

అయితే జపానులోజరిగిన వైద్యపరిశోధన ఫలితంగా పోర్టబుల్ మూత్ర పిండాలను క ను గొ న్నా రు. యీ మూత్రపిండాలకు డయాలిసిస్ లిక్విడ్ అవసరము లేదు.

ఈ కృత్రిమ మూత్ర పిండాలను ఒక పెద్ద జేబు సంచీలో అమర్చుకొన వచ్చును. ఒక పిల్టరు పంపు, బ్యాటరీ మరియు కంట్రోలర్ చేర్చియున్న యీ కృత్రిమ మూత్రపిండాలను జేబులో వుంచుకొని రోగి నడుస్తూ కూడా అతని రక్తాన్ని శుద్ధి పరచుకోవచ్చు. ఈ విప్లవాత్మకమైన పరిశోధనను టోకియోలోని స్త్రీల వైద్య కళాశాలవారు సాధించారు. (గోపాల్)

కుంటున్నాడు! దానికీ మనసూ, మమతా వుంటాయనీ ఒకసారి విరిగిన మనసు తిరిగి అతకదనీ తెలియదు బోలు! ఆడదాని మనసు ఎంత సున్నితమో– అంత కఠినమైనది కూడా అది అమృత వర్షాన్ని కురిపించగలదు. హాలాహలాన్ని వర్షించగలదు! మలయ సమీరంగా మురిపించగలదు. ప్రళయ ఝంఝామారుతంగా కూకటి వేళ్ళతో జీవిత వృక్షాన్ని పెకలించనూ గలదు! వలపు చలువ జల్లునూ విరియగలదు పెనుతుఫాననూ, సృష్టించగలదు! తెలి వెన్నెలలోని హాయినీ ఇవ్వగలదు. మధ్యాహ్న మార్తాండుని లాగా తాపాన్నీ కలిగించగలదు. పువ్వులోని పరిమళమూ కాగలదు ముల్లులోని వాడితనమూ చూపించగలదు అది తెలుసుకోలేని మూర్ఖుడతడు. ఆనంద్ భార్యగా ఇందిర ఏనాడో చచ్చిపోయింది. ఇప్పుడు ఉన్నది

# రాగద్వేషాలు

రావుగారి కూతురు– శ్రీనివాస్‌కి తల్లి మాత్రమే అంతే– అంతే!! అదే... అదే తన నిర్ణయం !

* * *

మర్నాడు కాఫీల దగ్గర తండ్రి అడగక ముందే ఇందిర– "మేము కలిసి బతకడం జరగదు నాన్నా. ఇదే నా నిర్ణయం" అంటూ ఆనంద్ వ్రాసిన ఉత్తరాన్ని ముక్కలు ముక్కలుగా చింపి చెత్తబుట్టలో పడేసింది. చేతుల్లో ముఖం కప్పుకుని ఏడ్చింది. రావుగారు ఏమీ మాట్లాడలేదు కూతురి వీపు నిమురుతూ వుండిపోయారు. తన కూలిన కాపురం గురించి చివరిసారిగా మనసారా ఏడిచింది ఇందిర! మనసు తేలిక పడేదాకా ఏడిచి మొహం కడుక్కొ వచ్చింది ఇందిర! విన్నడగా ఎరగనంత ప్రశాంతంగా వుంది ప్పుడు ఇందిర హృదయం !!

* * *

ఆ తరువాత వారం పదిరోజులకి కలకత్తాలో ఇల్లుకూడా అమ్మేసి, అన్ని సామానుతో హైదరాబాద్ వెళ్ళిపోయారు ఇందిర, రావుగారు శ్రీనివాస్‌తో కలిసి !

## 27

మరో ఆరు నెలల తరువాత–

ఆరోజు కలకత్తా నగరంలో– నిశాకాంత చంద్రుడికి స్వాగతం పలుకుతోంది! చంద్రునికి చెలికాళ్ళుగా తారకలు మెరుస్తున్నాయి. చల్లగాలి సుమసౌరభాలు నిశాకాంతకు చెలికత్తెలు వున్నాయి !

ఆ సమయంలో రావుగారు అమ్మేసిన ఇంటిముందుకి ఒక టాక్సీ వచ్చి ఆగింది! సూట్‌కేస్ పట్టుకుని ఒక యువకుడు కిందికి దిగాడు. టాక్సీ వెళ్ళిపోయింది. తల వంచు

కుని సరాసరి మెట్లెక్కాడు. కాలింగ్ బెల్ మోగించాడు! తలుపు తెరవ బడింది ఎదురుగా కనబడిన బెంగాలీ స్త్రీని చూసి ఆశ్చర్యపోయాడతడు! నోటమాట రాలేదు! అతడు ఊహించిందదికాదు! తేరుకునే లోపలే ఆ స్త్రీ బెంగాలీలో ఏదో అడుగుతున్నది! తేరుకుని

అతడు ఇంగ్లీషులో రావుగారి గురించి అడిగాడు! ముందు తనకు తెలియదంది –

ఆ తరువాత 'వాళ్ళు ఊరు వదలి పోయారంది!'

"ఎక్కడికో మీకు తెలుసా?"

"నాకు తెలీదు మీరెవరు?" అనుమానంగా అడిగింది. ఆ స్త్రీకి సందేహం భయం "దొంగతనాలు అనేక రకాలు!!" అనుకుంది!

"వారి బంధువుని లెండి వస్తాను" వెనుదిరిగాడు

"ఎక్కడికి వెళ్ళి వుంటారు?" ఆలోచిస్తూనే రెండు మూడు చోట్ల విచారించాడు నిరాశే ఎదురయింది! దురదృష్టవశాత్తూ ఆ సమయంలో అతడడిగిన చోట్లల్లో మగవాళ్ళెవరూ లేరు! ఆడవారు ఎవరూ సరయిన జవాబు ఇవ్వలేకపోయారు!

ఏం చెయ్యాలో బుర్ర పనిచెయ్యలేదు తనకు తెలిసిన రావుగారి కంపెనీలకు వెళ్ళి విచారించాడు. ఆ టైములో అతడికి ఇన్ఫర్మేషన్ ఇచ్చేవాళ్ళెవరూ లేక పోయారు దిగాలుపడిన ముఖంతో రైల్వే స్టేషన్ ముఖంగా నడక సాగించాడతడు!

అతడే- ఆనంద్!

తను ఎక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి? తన గతేమిటి? స్థితేమిటి? తను చేసిందేమిటి? పొందిందేమిటి? అన్నీ ప్రశ్నలే అతడి మెదడులో?!

ఆత్మావలోకనం మొదలయింది అతడిలో !!

*(అయిపోయింది)*

---

## అంకితం

మా నాన్నగారు- కీ శే. శ్రీ పిల్లలమర్రి వేంకట హనుమంతరావుగారికి కన్నీటితో

– పుణ్యశీల

---

# వారఫలం

1-12 1978 శుక్రవారం మొదలు

7-12 1978 గురువారం వరకు

**మేషం:-** రావలసిన డబ్బు అందుతుంది మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది

**వృషభం:** ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వారం మధ్యలో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. అనుకూలమైన వార్తలను వింటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు. ఆరోగ్యం బాగుండదు. అలంకార వస్తువులు కొంటారు.

**మిధునం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి ఎవరితోను వాద ప్రతివాదాలు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి వారం ఆఖరులో చికాకులకు గురికాగలరు స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**సింహం:—** వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది అనవసరమైన సందేహాలు కలుగుతాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కన్య:** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు

**తుల:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. స్త్రీలకు- దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు

**వృశ్చికం:** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు:** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనంగల పరిచయాలు ఏర్పడతాయి. రావలసిన డబ్బు అందుతుంది రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. విలాసవస్తువులుకొంటారు

**మకరం:-** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. ప్రయాణాల్లో శ్రమకలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలుబాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం తగ్గుతుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు- ఆరోగ్యం బాగుండదు శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది

**కుంభం:** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. వ్యతిరేకమైనవార్తలను వింటారు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు- కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును స్త్రీలకు- ఆరోగ్యం బాగుంటుంది. మీ బాబూకు వస్తువులు పోవచ్చును.

మహేష్





# ఇంటికథ

జొన్నలగడ్డ లలితాదేవి

పంపు దగ్గర బకెట్ చప్పుడు, బిందెల చప్పుడు వింటూ బద్ధకంగా కళ్లు తెరిచింది సరిత. ఇక్కడ ఆవుల అంబారవాలు, పక్షుల కల కూజితాలూ వింటూ నిద్రలేచే అదృష్టం లేదు తన పల్లెటూరిలోలా: ఇక్కడ పాలసీసాలైనా మేల్కొలుపుతాయి పనిమనిషైనా లేపుతుంది. అవి కాక పోతే పంపులో నీళ్ళకోసం పడిగాపులు పడే బిందెల చప్పుడైనా లేపుతుంది.

అది మూడిళ్ళున్న మేడ. ఆ మేడవారికి ఒకటే పంపు. ఆ మూడిళ్ళకే కాక పక్క డాబా వారికి కూడా అదే కామితార్థప్రదాయిని కనుక వెరసి ఎనిమిదిళ్ళ డిమాండ్ వుంది టాప్‌కి. అంచేత పంపులో నీళ్ళ కోసం ముందే లైనులో పడేసి వుంచుతారు బిందెలు.

సరిత లేచి తన వంతుక్కూడా లైనులో బిందె పెట్టి లోపలికి రాబోతుంటే "చెల్లాయి లేటుగాలేచినట్టుందే" అంటూ పలకరించాడు పక్కింటి అన్నయ్యనారాయణ.

అతనికో సన్నని మందహాసం పడేసి లోపలకు వచ్చింది. ఆయింటికీ ఈయింటికీ మధ్యలో గోడే అడ్డం కనుక పక్క వాళ్ళు ఏమి మాట్లాడుకున్నా ఖచ్చితంగా వినిపిస్తాయి సరితకి. పైగా పక్కింటి వారి కంఠం మైకు అక్కర్లేకుండా మూడ మైళ్ళు గ్యారంటీగా వినిపిస్తుంది కనుక వద్దు వినకూడదు అని అనుకున్నా సరితకి తప్పదు

"ఏమే శ్రీదేవీ: పంపులో నీళ్ళు వచ్చాయేమో చూసి బిందెతో నీళ్ళు పట్టుకురా" పక్కింటి కోడలికి అత్తగారిస్తున్న తాఖీదు స్పష్టంగా వినిపించింది సరితకి

"మనవంతు అప్పుడే రాదుగా అత్తయ్యా! మనకంటే ముందు ఇద్దరివి వున్నాయిగా" కోడలి సమాధానం.

"వాళ్ళు లేరుగా బిందెలు పడేసి ఇంట్లోకి పోయారయ్యే మార్చిపారేయ్ ముందు మనది పెట్టు."

"అమ్మో వాళ్ళొచ్చి దెబ్బలాడరా ?" కోడలు భయం వ్యక్తంచేసింది

"ఏడిశారు. వాళ్ళేదైనా అడిగితే నాకు చెప్పు నేను వచ్చి గట్టిగా చెబుతాను సమాధానం అంటున్న ఆ అత్తగారి హామీ వింటూ సరిత ముఖం కడిగి లోపలికి వచ్చింది.

ఎవరిమాటెలావున్నా శ్రీదేవిమాత్రం అత్తగారికి వినయ విధేయతలు గలిగిన కోడలు కనుక ఆవిడ వాక్కు వేదంలా భావించి అక్షరాలా బిందెలు మార్చేసింది. ఇంతలో నీళ్ళు వచ్చాయి. ముందే బిందె పెట్టి పోయిన అమ్మగార్లిద్దరూ దిగారు.

"ఏమమ్మా మా బిందెలు తీసి నీది పడతావా ?" అంటూ గయ్యిన లేచారు. అత్తగారి హామీ గుర్తుంచుకున్న కోడలు "అత్తయ్యా! వీళ్ళు చూడండి" అంటూ అరిచింది. "పిలు భయమా!" అంటూ రెచ్చిపోతున్న వాళ్ళని చూసి ఏమిటే అంటూ దీర్ఘం తీసుకుంటూ వచ్చింది ఆవిడ.

"బిందె మార్చేశానంటున్నారు." కోడలి మాటవిని–

"మార్చే వుంటావు ? అయినా నీకంత తొందరెందుకు ? వాళ్ళవి పట్టాక పట్టొచ్చుగా. అమ్మా కమలమ్మా ఏం అనుకోకు. నా కోడలితో నేనిలాగే ఇంట్లో కూడా వేగలేక చస్తున్నాను. ఒక్కమాట వింటుందా పెడుతుందా. ఇందాక నాతో అంటే వద్దులేవే తప్పు అలా చేయ కూడదు అన్నా. అయినా వినలేదు." అంటూంటే పాపం శ్రీదేవికి కళ్ళనీళ్ళపర్యంతం అయింది.

ముందునించీ వింటున్న సరితకి నసాళం అంటేలా తమాయించుకుంది. "ఛీ ఎంత గొప్పగా ప్లేటు ఫిరాయించేసిందో, తెలివంటే అదే మరి. చేసేవన్నీ చేస్తూ తెలివిగా ఇతరులమీద పెట్టి వేయడం అందరికీ చేతరావద్దూ" అనుకుంది కసిగా.

శ్రీదేవిని నానా మాటలూ ఆ రోజల్లా అంటూనే వున్నారా యిద్దరిళ్ళ వాళ్ళూ. శ్రీదేవి బి. కాం. చదివింది. భర్త జల్సా రాయుడు. ఎక్కడా ఉద్యోగం చెయ్యడు. అసలతగాడికి చేసే ఉద్దేశమూ లేదు. అథవా చేయబోదామన్నా వరల్డ్ మొత్తంమీద ఎవడూ ఉద్యోగం ఇవ్వడు. అంత క్వాలిఫైడ్ అన్నమాట. అలాంటి వ్యక్తిని శ్రీదేవిలాంటి విద్యావతికి సమకూర్చిన విధి మాటేమోగాని ఆమె తల్లిదండ్రుల్ని తలచుకుని మాత్రం మండిపోయింది సరిత.

ఏదీ అనడానికి నోరెత్తడానికి వీల్లేదు శ్రీదేవి. ఎందుకంటే ఆ పతిదేవుడు ఆమెని కట్నం తీసుకోకుండా పెళ్ళాడి ఉద్ధరించాడు కనుక. అతగాడికి సపోర్టు వాళ్ళ అమ్మ. వెనకే అతని తండ్రి. లేచిందగ్గర్నించీ అన్నీ అత్తగారికి అమర్చి అప్పుడు ఉద్యోగానికి వెళ్ళాలి శ్రీదేవి. ఆవిడ సంపాదించందే ఆ ఇల్లు గడవదు. మళ్ళీ వచ్చిందగ్గర్నించీ చెయ్యాలి. తెచ్చిన జీతం అంతా పైసలతో లెక్కవేసి మామగారి చేతిలో పొయ్యాలి. ఆఫీసులో ఆకలేసినా కాఫీ, టీ లాగకూడదు. నడిచి వెళ్ళాలి, నడిచి రావాలి. బస్‌కి డబ్బులు తగలెయ్యకూడదు. ఇది మామగారి ఆర్డరు. అలిసిన శరీరానికి విశ్రాంతి అనేది ఇవ్వకుండా రాత్రి భార్య గదిలోకి రావడం ఆలస్యం శృంగారం కోసం పొంచి వుండే భర్త. వీటన్నింటి మధ్యా శ్రీదేవి జీవితం ఎలా గడుస్తోందో సరితకి బాగా తెలుసు. ఆమెకి శ్రీదేవి అంటే చాలా సానుభూతి, జాలి వున్నా పైకి ప్రదర్శించడానికి వీల్లేదు. భార్యని కాల్చుకు తినడానికి తప్ప ఎందుకూ పనికిరాని శ్రీదేవి భర్త నారాయణ బయటి వాళ్ళని ముఖ్యంగా ఆడవాళ్ళని చెల్లాయ్, చెల్లాయి అంటూ మహా ఆప్యాయంగా కబుర్లు చెబుతుంటాడు. అదే మంట సరితకి.

"ఒట్టి ఆడారి వెధవ" అనుకుంటాడు సరిత భర్త.

తన వంతు నీళ్ళు పట్టుకుంటోంది సరిత. మూలుగుతూ మూడోయింటావిడ బిందెడు నీళ్ళు మోస్తుంటే జాలిగా చూసింది.

"ఒక్కోబిందెకి ఇంతంత సేపయితే ఇంట్లో తొట్టెప్పుడు నిండుతుంది?" అంటూ గయ్యిమంటోంది ఆవిడ కోడలు మల్లిక.

"పిల్లదో సంత" అనుకుంది విసుగ్గా సరిత. రోజూ పోట్లాటలే ఆ యింట్లో. అత్తగారికి, మామగారికి భర్త ఒక్కడే కొడుకు కనుక అతని దగ్గరే వుండాలి వాళ్ళు. వాళ్ళకింక వేరే దిక్కులేదు కనుక. అది మరీ అలుసు మల్లికకి. వార మాసపత్రికలు చదవడంతప్ప వేరేపని లేని మల్లికకు అత్తమామల్ని బాధించడమే ఓ పెద్ద పని. దీంతో ఓపిక చేసుకుని లేవలేకపోయినా మల్లిక అత్తగారు ఇంటెడు పనీ చేస్తుంది. అయినా ఏదో ఒకటి గొణుకుతూనే వుంటుంది మల్లిక.

అటు శ్రీదేవి, ఇటు మల్లిక అత్తగారు మానసికంగా సరితకి బాధ కలిగించే వ్యక్తులు! ఇష్టం లేకపోయినా మాట్లాడించే నారాయణ, మల్లిక సరిత ఓర్పుని పరీక్షిస్తుంటారు.

"సరితా వంటయిందా?" అంటూ భర్త పిలుపు విని ఉలిక్కిపడి గబగబా కూర ముక్కలు మూకుడులో పడేసింది సరిత.

"అత్తయ్యా, కూరలు ఏమీలేవు." పక్కింటి శ్రీదేవి కంఠం.

"నిన్న సాయంత్రం 'ఆ మాట చెప్పి తగలడక పోయావా?' కాస్త చింతకాయ

పై వారమే!

గవర్నెస్ కరుణ

కొత్త సీరియల్

త్వరలో వెలువడుతోంది!

కథలు... సీరియల్స్...
వివిధ ఫీచర్సతో బాటు
అందమైన ఆఫ్‌సెట్
ముఖచిత్రంతో......
సాటిలేని
అనేక హంగులతో
సచిత్ర వారపత్రికగా!

జ్యోతి
వారపత్రిక

జ్యోతి సచిత్ర వారపత్రిక
P.B.NO.387, విజయవాడ-2
ఫోన్ 76770- ఎక్స్‌టెన్షన్-2

DIMPLE

## ఓ ఇంటికథ

పచ్చడి నూరుకొని తినిపో" అంటూ అండాళ్ళమ్మ తొంగుమంది చింతకాయ పచ్చడి వేసుకొని ఇంటెడు చాకిరీ పస్ ఉద్యోగం చేసే శ్రీదేవిని తలుచుకుని ఆమె ఓర్పుకు మనసులోనే మెచ్చుకుంది సరిత.

"బాబుని కూడా రమ్మనండి" సరిత మాటవిని ప్రభాకరం కొడుకు కోసం వెతికాడు.

"వాడు లేడు సరితా. నాకు వడ్డించు" అంటూ పీట వాల్చుకుని కూర్చున్నాడు ప్రభాకరం.

కొడుకు ఎక్కడికి వెళ్ళాడో సరిత తేలిగ్గానే వూహించింది స్కూలుకు టైము అయిపోతోంది బాబోయ్ అని మొత్తుకున్నా మళ్ళీక వినకుండా బాబుని హోటల్‌కి తోలుతుంది టిఫిన్ తెమ్మని. ఇంట్లో చేస్తే అత్తామామలకి కూడా పెట్టవలసి వస్తుందని ఆవిడ బాధ. అంచేత చాటుగా తెప్పించుకుని తింటుంది.

"ఆఁ వీళ్ళకి తిండి పెడేస్తున్నాం చాల్లే! ఇంకా టిఫిన్లు కూడా ప్రారంభిస్తే ఇల్లు గుల్లయిపోదూ" అంటూ వ్యాఖ్యానిస్తే సరిత మనసులోనే అసహ్యపడి వూరుకుంది.

అండాళ్ళమ్మతో ఆ రోజల్లా మాట్లాడ లేదు సరిత

"ఏం వచ్చిందో పోయేకాలం. మాట్లాడ లేదు. చదువుకున్నానని గర్వం. ఏదో కథలు నవలలు రాస్తుందిగా మరింత అతిశయం" అంటూ కొడుకుతో అనడం స్పష్టంగా విన్నది సరిత.

"మరే! లేకపోతే ఇదేమన్నా మనమీద చెప్పి వచ్చిందేమో" పెళ్ళాంమీద అనుమానం వెలిబుచ్చాడు సుపుత్రుడు.

"రాంగానే నిలబెట్టి అడుగుతాను." అండాళ్ళమ్మ ప్రతిజ్ఞ.

సరితకి ఒళ్ళు మండిపోయింది. దొడ్డి వైపునించి వినిపించే ఈ మాటలు ఇంక వినడం ఇష్టంలేక తలుపు వేసుకొని వీధి వైపు వచ్చింది.

అప్పుడే లోపల్నించి బయటికి వచ్చిన అండాళ్ళమ్మ ముఖం అంతా నవ్వు పులుముకుని "మా కొత్త ఆవకాయ కాస్త రుచి చూడమ్మాయ్" అంటూ గబగబా లోపలికి వెళ్ళి చిన్న గిన్నెలో పెట్టి తెచ్చింది.

"దొడ్డివైపు తిటి పొయ్యడం వీధివైపు ఆపేక్ష వలకించడం'' అనుకుంది మంటగా.

ఆ గిన్నెలోనే తను ఆవకాయ పెట్టి గిన్నె కొడుకుచేత పంపింది సరిత.

''ఒరేయ్! నాకు కూతురు పుడితే నీకేరా ఇచ్చి చేసేది. కొడుకు పుడితే మీ చెల్లెలికే! పెద్దదయినా ఫర్వాలేదు'' అంటూ నారాయణ ఇకిలిస్తుంటే—

''నరే! నా ఖర్మకాలి ఈ భూ ప్రపంచంలో వేరే మనుషులే లేనట్టు వీటోనే వియ్యమందాలి'' అనుకుంది కసిగా.

"ఏమే ఏమన్నా మామీద చెప్పావా?'' అంటూ ఆ రాత్రి నారాయణ శ్రీదేవిని దబదబా బాదడం స్పష్టంగా విన్నది సరిత. ఆమె కళ్ళలో నీరు తిరిగాయి

''ఛీ! ఏమాశించాకొంపలో బతుకుతోంది శ్రీదేవి?' అనుకుంది బాధగా. వాళ్ళ మనస్తత్వాలు, వాళ్ళ ధోరణి చూస్తుంటే మాట్లాడబుద్ది కావడంలేదు సరితకి

మాటాడకపోతే దానికి కారణం శ్రీదేవే అనుకోవడం, వేయి చేసుకోవడం మరింత కష్టం కలిగించింది.

ఆ మర్నాడు "సరితగారూ! కాస్త బిందె ఎత్తుతారా?'' శ్రీదేవి మాట విని బిందె ఆమె భుజానికి ఎత్తి పెడుతూ ఆమెకేసి నూసింది.

''ఏం శ్రీదేవి? ఒంట్లో బాగా లేదా?'' అంటూ నెయ్యివేసి చూసింది. బాగ వేడిగా తగిలింది. ''జ్వరం వుంది. మందు వేసుకోండి'' అంది బాధగా.

కాని శ్రీదేవి అదే పనిగా దగ్గటం కూడా రెండో రోజు గమనించింది మనిషి ఆ రోజుకారోజు తుస్కించి పోతుంటే ఆఫీసుకు వెళ్ళలేక శలవు పెట్టింది.

ఇంక ఇంట్లో సాధింపు "నీ మొహం తగలెయ్య. మనిషన్నాక కాస్త రోగం రాకుండా వుంటుందా? దానికోసం ఆఫీసు మనుతావా?'' అంటూ తిట్టి పోస్తుంటే సరిత మనస్సు భగ్గుమన్నా ఏం చేయగలదు ?

'నేను వెళ్ళలేను అత్తయ్యా'' అంది దీనంగా శ్రీదేవి.

"అయితే మాడేచావు''అంటూ అప్పటి నుంచి అన్నంగాని, కాఫీగాని ఇవ్వడం మానేసింది అండాళ్ళమ్మ.

శ్రీదేవికి టి. బి. అది ప్రత్యక్షంగా అందరికీ తెలుస్తూనే వుంది. టి. బి. కి చాలా బలమైన ఆహారం వుండాలి బలం మాట అటుంచి తిండే లేకుండా పోయింది. మంచి మందులు వదాలి. డబ్బాయి పోతుంది కనుక మందిప్పిచ్చరు. అయినా ఆమె నీళ్ళ బిందెలు మోయాలి. యేటెదు బట్టలూ వుతకాలి. ఉద్యోగం వచ్చినట్టు చెయ్యాలి. పొయ్యిసెగన వంటకూడా చెయ్యాలి. ఇవన్నీ అయ్యేసరికి ఆమె మరింత అలసిపోయి జ్వరం వస్తుంది. ఇంక లేవలేక పడుకుంటే ముగ్గురూ పెట్టుకుని తింటారు గాని లేపి కాస్తంత అన్నం పెట్టరు.

ఇవన్నీ చూసి భరించగలిగే శక్తిమంతురాలు కాదు సరిత ఆమెది చాలా సున్నితమైన మనస్సు పక్కింట్లో జరిగే ఈ దారుణాలన్నీ వద్దన్నా ఆమె చెవిన పడుతుంటె ప్రత్యక్షంగా చూస్తుంటే సాటి స్త్రీ కోసం ఆమె మనస్సు చెరువయిపోతోంది. ఏదో చెయ్యాలన్న కసి. ఏమీ చెయ్యలేని స్థితి ఏదన్నా అంటే శ్రీదేవినే తిట్టిపోస్తారని భయం.

అప్పాట బిందె మొయ్యలేక బిందె పడేసింది శ్రీదేవి.

"నీ మొహంమండ. విస్తే పంలాంటి బిందె సొట్టపోగొట్టావుగదే! తిండి దండగ తప్పదేనికి పనికొస్తావే ''అంటూ నారాయణ కొట్టడం విని భరించలేక పోయింది సరిత.

చటుక్కున ఇవతలకి వచ్చేసరికి మూడో ఇంట్లో గలాటా.

ఈ ముసలాడి రోగాలొకటి మా ప్రాణానికి. ఎన్నాళ్ళు బతకాలని? బతికి ఏం సాధించాలని! మందులో మందులో అని చస్తావు?'' అంటూ మల్లిక అత్తని నిలవేస్తోంది.

మాణిక్యమ్మ వూరుకోలేకపోయినట్టుంది. "కొడుకుకు వున్న ఆస్తి అంతా పెట్టి చదువులు చెప్పించి, ఉద్యోగాలు వేయించి ఆయన గదూ అష్ట కష్టాలూ పడింది. అలాంటి కన్న తండ్రికి రోగం వస్తే కాస్త మందిప్పించ లేరా ?'' అందట. అంతే ఇంకేముంది? ఈ ఎదురు ప్రశ్నకి తోక తొక్కిన తాచులా లేచింది మల్లిక.

అది చిలికి చిలికి గాలి వాన అయింది. ఆవిడ కన్నీళ్ళు పెట్టుకుంటూ సరితదగ్గరికి వచ్చి "చూడమ్మా! ఆయన నాలుగు రోజులనుంచి జ్వరంతో అల్లాడి పోతున్నారు— కాస్త ఓ మందుబిళ్ళ తెచ్చిపెట్టలేరా! ఆసలాయనకి రోజూ నాలుగు మెతుకులు తిన్నాక ఓ వక్కపొడి పొట్లం వేసుకోవడం అలవాటు. అయిదు పైసలకి నానామాటలూ అన్నది చిన్నప్పట్నుంచి వచ్చిన అలవాటు ఒక్కసారే పోతుందా!'' అంటూ అంత పెద్దావిడా వెక్కి వెక్కి ఏడుస్తుంటే నిలువెల్లా కదిలిపోయింది సరిత.

"ఛీ! అటు చూస్తే ఆయింటి గోల.



కటు చూస్తే ఈ యింటిగోల. ఇవన్నీ పడలేక నా ప్రాణం పోతోంది" అనుకుంది దిగులుగ.

"ఛీ! ఇక్కడ్నించి వెళిపోవాలి" అను కుంది చివరకి

"మనం ఈ యిల్లు ఖాళీ చేసేద్దాం" అంది భర్తతో.

"నోరు మూసుకో! ఈ పాటి సౌకర్యం గల ఇల్లు ఈ అద్దెలో మళ్ళీ మనకి దొర కద్దూ! బాబు స్కూలికి, నా ఆఫీసుకి దగ్గర్లో" అంటూ ప్రభాకరం ఆమె నోరు నొక్కేస్తే పిచ్చిదానిలా చూసింది సరిత మరీ కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని ఉన్న శ్రీదేవిని చూసి సహించలేక అత్త అండా ళమ్మ ఎక్కడికో వెళడం చూసి "కాస్త మా యింట్లో అన్నం తిందువుగానిరా!" అని పిలిచింది సరిత

పాపం విలాంటివారికైనా ఆకలిబాధ భరించలేనిది. అష్టకష్టాలు పడేది ఈ జానెడు పొట్టకోసమే ననుకుంటే ఆ ఆకలికి అలుముటించే ప్రాణాలు ఎన్నెన్నో.

అన్నంతిని ఎన్నాళ్ళయిందోగాని పిలవగానే వచ్చింది శ్రీదేవి.

రెండుముద్దలు తిన్నదో లేదో అంతే, ప్రళయంలా వచ్చేసింది అండాళమ్మ. శ్రీదేవికి మళ్ళీ ఇంకోముద్ద కిందకి దిగలేదు. కోడలింట్లో కనబడక పోవడం చూసి సరాసరి సరిత తలుపుకొట్టి మరీయింట్లోకి వచ్చింది అండాళ్ళమ్మ. శ్రీదేవి భయం భయంగా చేయి కడిగేసి లేచింది.

# ఓ ఇంటి కథ

అండాళమ్మ అడేమిటే చకలేస్తే ఇంటో గన్నెడన్నం వుంది కదా. తినక పోయా వూ!" అంటూ దీర్ఘం తీసినా రాత్రికి ఏదో ఉప్పెన రానేవస్తుందని రూఢి పరచు కుంది సరిత

అనుకున్నట్లే రాత్రి ప్రభాకర్, సరిత లిద్దరూ భోజనం చేస్తున్న సమయంలో నారాయణ బంగాబాతులు. ఏం పెట్టి కొట్టాడోగాని శ్రీదేవి బాధా పూరిత కంఠం విని అన్నం తినలేక వెంటనే చెయ్యి కడిగే సుకుంది, భర్త పక్కనే భోజనం చేస్తున్నా డన్నమాట మరచిపోయి వెంటనే కంచం ముందు నించి లేచాడు ప్రభాకర్. అతని కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి.

'నీకు మరీ పొగరెక్కువయింది. కంచంలో నీళ్ళుపోసి లేస్తావా! అసలు నిన్నేమన్నావని? నీకు సాధించడం బాగా తెలుసు ఎప్పుడో ఏడాది కిందట ఏదన్నా మాట అంటే అది తిరిగా ఇప్పుడు గుర్తు చేసుకొని ఇలాంటి తిక్క పనులు చేస్తుంటావు" అంటూ మండిపడే అతన్ని చూసి తల దించుకుంది సరిత.

ప్రభాకరం చొక్కా వేసుకొని బయటికి విసురుగా వెళ్ళిపోయాడు. తనేగాదు భర్త కూడా అర్ధాకలితోనే లేచాడు అతనికా సమ యంలో ఎలా చెప్పాలో తెలియలేదు. చెప్ప డానికి తనవాణి మూగవోయింది అది అతనికి అర్ధంకాదు. అతని కిలాంటివి విన బడవు అదీ అదృష్టానే మరి

"ఛీ! ఈ కొంప ఖాళీచేసి పోవాలి. లేక పోతే ఈ బాధ భరించలేను. అనవసరంగా భర్తకీ తనకీ కలతలు ఏర్పడుతున్నాయి" అనుకుంటూ అన్నీ సర్ది మంచం మీద పడి కళ నీళ్ళు పెటుకుంది సరిత.

ఎక్కడ తిరిగాడో ఏమో పదకొండు న్నరకి తలుపు తట్టాడు ప్రభాకర్. భర్త కోపమే కనిపెట్టుకుని వుంది సరిత. రావడం తడవు తలుపు తీసింది. అతను చొక్కా మార్చి వచ్చి ముభావంగానే మంచంమీద ఒరిగాడు

మెల్లగా అతని పక్కనే పడుకొని అతన్ని ప్రసన్నుడిని చేసుకోవడానికి ప్రయ త్నించింది. మెల్లగా జరిగిందంతా చెప్పింది. అన్నీ విన్న ప్రభాకర్ చటుక్కున లేచి కూర్చు న్నాడు.

"నిన్ను అనవసర విషయాల్లో కల్పిం చుకోవద్దన్నాను. ఇల్లు అన్నాక లక్షా తొంభై జరుగుతాయి. అవన్నీ నీలాగా అంతా వింటూ మనసులో పెట్టుకుంటూరా ఏడుస్తూ కూర్చుని మాడి చస్తారా! సిగ్గు లేకపోతే సరి! పైగా బి. ఏ. డిగ్రీ తీసు కున్నావు. కథలు, కావ్యాలు వెలిగిస్తావు. ఎందుకు? ఆ మాత్రం గుండె ధైర్యం లేక పోయాక?" అంటూ గయ్యిమన్నాడు. అతనికి కడుపులో ఆకలి మండిపోతోందిమరి.

ఆమంట, ఈమంటా వెళ్ళి సరితని పట్టు కున్నాయి. కూతుర్ని చూసి పోదాం అనుకుంటూ వచ్చాడు సరిత తండ్రి రామానుజం. తెల్లారి ఏడింటికి ఇంట్లో అడుగుపెట్టిన మామగార్ని సాదరంగానే ఆహ్వానించాడు ప్రభాకర్.

సరిత గబగబా కాఫీ కలిపితెచ్చి ఇచ్చింది. కిందంతా నీళు మోస్తున్న శ్రీదేవి గమ నిస్తూనే వుంది. ఆమె కళ్ళ ముందు ఆమె కన్నవారు తిరుగుతున్నట్టున్నారు. బాధగా కళ్ళు ఒత్తుకుంటోంది తనవారెవరూరారు. వచ్చి చూడరు. వస్తే ఏదో అంటూ వుంటారు వీళ్ళని. కూతురు చావుకు సిద్ధ మైనా వాళ్ళు రాలేదు.

"మీ అమ్మాయికా మధ్య బొత్తిగా చెప్పినమాట వినడంలేదు" అంటూ ఫిర్యాదు చేశాడు ప్రభాకర్.

పెళయిన ఆరేళ్ళకి అల్లుడి నోటివెంట



# హార్లిక్స్




## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణమయిన ఆరోగ్యం చేకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి. దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.

అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది.

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం, మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

ధర్మపథం

# విష్ణుదేవుని నాల్గు వ్యూహములు

లోకంలో అధర్మం పెరిగి, ధర్మం క్షీణించినప్పుడు, ధర్మాన్ని పునరుద్ధరించడానికీ, దుష్టుల్ని శిక్షించి శిష్టుల్ని రక్షించడానికి భగవంతుడు అవతారాలు ఎత్తుతూ ఉంటాడు. అలా అవతరించినప్పుడు, ఆయన ఆ అవతారమూర్తిగానే ఉంటాడా ? ఇతర్రతాకూడా ఉంటాడా ? అనే సందేహం చాలామందికి కలగవచ్చు ఆ సందేహం తీరడానికి ఈ వ్యాసం బాగా ఉపయోగిస్తుంది.

విష్ణుదేవుని మూర్తులు నాలుగు. అవి- సంకర్షణ, వాసుదేవ. ప్రద్యుమ్న, అనిరుద్ధ నామములు కలవి. వ్యూహాలని కూడా వీనికి నామాంతరం. వీనిలో ప్రధాన మూర్తి అనిర్దేశ్యమైనది. అది గుణాలకు అతీతమై ఉంటుంది. దేవతలు కూడా దాని తత్వాన్ని గ్రహించలేరు. అది సదా శుద్ధరూపమై స్థిరమై ఉంటుంది. దీనినే వాసుదేవమూర్తి అని విజ్ఞులు అంటారు.

రెండవది సంకర్షణవ్యూహం. ఇది శేష మూర్తి అని కూడా అంటారు. తమోగుణం ఇందుకానవస్తుంది. నాగరూపంతో ఉండి భూమిని భరించేది యిదే! వాసుదేవ మూర్తికి రూప, వర్ణాదులుండవుగాని దీనికి ఉంటాయి. మొదటి వ్యూహం నిర్గుణమై ఉంటే మిగిలిన మూడు మూర్తులూ క్రమంగా తమోగుణం, సత్వగుణం, రజోగుణం కలిగి ఉంటాయి. రెండవ రూపం తిర్యగ్రూపమైనదే !

మూడవమూర్తి సత్వగుణ ప్రధానమైనది. అధర్మం పెచ్చుపెరిగి ధర్మం నశించే స్థితి యేర్పడినప్పుడు, ధర్మ సంస్థాపన చేసే వ్యూహం యిదే! ప్రద్యుమ్న వ్యూహం అదే! ఈ మూర్తికే ప్రజా పరిపాలనయందు ఆసక్తి అధికం. ధర్మాన్ని నశింపజేసే క్రూర రాక్షసులను, వివిధావతారాలెత్తి సంహరించేది యీ వ్యూహమే! దశావతారాలను ఎత్తేది యీ ప్రద్యుమ్నమూర్తియే! తిర్యగ్రూపంలోనూ, మనుష్యరూపంలోనూ, దేవతా రూపంలోనూకూడా ఇది ఉంటుంది.

నాల్గవ వ్యూహం రజోగుణ ప్రధానమైనది. అనిరుద్ధ మూర్తి యిదే! పాలసముద్రం పైని పన్నగ తల్పంపైని పరుండి యోగనిద్రలోనుండేదీ, కష్టాలలో ఉన్న దేవతలకు సలహాలనిచ్చేదీ యీ మూర్తియే!

ఈ విధంగా విష్ణుదేవుని మూర్తులు నాలుగు. మొదటిది నిర్గుణమైనది. తర్వాతివి సగుణాలు ! సత్వగుణం గల వ్యూహమే అవతారాలెత్తే బాధ్యతను వహించి ఉంటుంది

—బులుసు వేంకటరమణయ్య.

---

## ఓ ఇంటికథ

వచ్చిన ఈ మాటకి తెల్లబోయాడు రామానుజం.

"తన ఇల్లు తన వ్యాపకాలు తన గొడవలో తనుండదు. వాళ్ళింట్లో అలా బాధపడుతున్నారు. వీళ్ళింటో ఇలా కొట్టుకున్నారు. అంటూ తనుతిండి మానేస్తుంది. నన్ను మాడ్చి చంపుతోంది."

రామానుజానికి కూడా కూతురి తెలివి తక్కువకి వళ్ళు మండింది.

"ఎవరింట్లోనో ఏదో అయితే నీకేమిటే! ఆమాత్రం జ్ఞానం లేదూ" అంటూ మందలించాడు కూతుర్ని. ఆ తర్వాత అల్లుడిని చూసి "పోనీలెండి. ఏదో చిన్నతనం" అని సర్దబోయాడు తండ్రి.

"తనకి తెలియకపోతే పెద్దవాడిని నేను చెబుతున్నానుగా" అంటూ అందుకున్నాడు ప్రభాకర్.

చివరికి చాలా నీతులు బోధించి శెలవు తీసుకున్నాడు రామానుజం. ఎవర్నీ ఏమీ అనలేక నిస్సహాయంగా చూసింది సరిత.

ఎవరిళ్ళల్లో ఏంజరుగుతున్నా పట్టించుకోకూడదు. నిజమే. కాని ఇలాంటి గుండెల్ని పిండే బాధని ఎలా భరించడం? తన వయసు స్త్రీ అలా అలమటిస్తుంటే; ఏ తప్పూ లేకపోయినా దండనకి గురి అవుతుంటే చూస్తూ వూరుకోవడం తన మనస్సుకి సాధ్యం కావడంలేదు.

అలా అని తనేమన్నా ఆమెకి ఉపకారం చేయగలుగుతుందా; అదీలేదు. వూరికే బాధపడి కన్నీరు కార్చినంత మాత్రాన శ్రీదేవి కష్టాలు తొలిగిపోతాయా ? అనుకుంటూ బాధగా ఆక్రోశించింది సరిత

ఆ మర్నాడు శ్రీదేవి కనిపించలేదు. నారాయణ చెల్లెళ్ళతో కబుర్లాడుతూ నీళు పట్టుచ్చునుకుంటూ బిందె తీసుకు తయారైతే ముఖం తిప్పేసి లోపలికి వచ్చింది సరిత.

ఆ రాత్రికి మళ్ళీ యధావిధి. "ఇంక నీకు మాకు ఏ సంబంధంలేదు. ఈ యింట్లోంచిపో" శ్రీదేవి మామగారి కంఠం.

"దిక్కుమాలిన రోగం ఇదీని, ముందు మా ప్రాణం పోతోంది." అంటూ నారాయణ వంతపాట.

అదేసమయంలో అవతలి వాటాలోంచి పెద్ద పెద్ద అరుపులు, గొడవ, గందరగోళం.

ఆ యింటి ముసలాయన పరిస్థితి అద్వాన్నంగానే తయారైంది. శ్రీదేవిని చూడాలని సరిత మనసు తెగ ఆరాటపడుతోంది. చూడటానికి ఆమె బయటికి రాలేదు.

"ఏమయింది? ఎలావుంది?" ఒక్కసారి చూడాలనిపించి వాళ్ళంతా పరామర్శకి మూడోనాటా వాళింటికివెళ్ళగా చూసి ఒక్కసారి ఆండాళమ్మ వాటాలోకి తొంగిచూసింది సరిత. మృత్యువుతో పోరాడుతూ, ఆయాసపడుతూన్న ఆ పాలికేళ యువతిని చూసి కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరగగా యింట్లోకి వచ్చేసింది సరిత. ఆమె మనస్సును శ్రీదేవి రూపం తూట్లు పొడుస్తోంది.

తెల్లవారింది. అసలెవరితోటీ మాట్లాడ

(37 వ పేజీ చూడండి)


(గత సంచిక తరువాయి)
అబ్బా! ఏమీ దుర్గంధము. శుష్క కళేబరములతో నిండియున్నది ఇదియే బక స్థానము కావలయును. హు!... ఈ దుర్గంధపూరితమైన ప్రదేశము నేనుండుటన్నకేమి? యమునా తీరమున బండి నాపి అసురుని పిలిచెద...
ఓ! బకాసురా
వాడు వచ్చు లోపల, ఈ అన్నమునే నే భుజించెదను


బకాసురుడు వచ్చి.......
ఏమీ! పిడికిట పొడిచినను బెదరక కూర్చున్నవాడు!... ఎందుకైన మంచిది ఒక చెట్టును పెరికి ఆయుధముగ తెచ్చెదను
భీముడన్నమంతయు తిని దగ్గరనున్న సాలవృక్షము పెరికి.........
ఓరి! బకాసుర! మనుష్యమాంసము తిని మదించి క్రొవ్వెక్కియుంటివి.... రమ్ము వాని నెల్లగక్కించెద......


భీమ బకాసురులు, చెట్లతో బండలతో భయంకరయుద్ధము సల్పి తరువాత మల్లయుద్ధమునకు తలపడిరి.....
బకుడు భీముని క్రింద పడవైచి గుండెలో బలముగ పొడిచెను
హు! వీడు మహాబలుడు.. వీని వెన్నుపొడిచెద.
భీముడు బకుని కంఠమును, మెడ కాని మోకాటితో పొడిచెను. ఆపోటుకు బకాసురుడు, రక్తము గ్రక్కుచు పెద్దగా అరిచి ప్రాణములు విడచెను..


బకుని అర్పు వలన కలిగిన మహాధ్వని విని, వాని చుట్టములగు రాక్షసులు వచ్చిరి వారిని జూచి భీముడు......
ఓరీ! రక్కసులారా! ఎన్నడు ఈ దురాత్ముని వలె మనుష్యులను తినరాదు. భక్షించినవారు, ఈ బకాసురుని వలె చత్తురు, జాగ్రత్త.
ఈ బకాసురుని కళేబరమును నగరద్వారము దగ్గరకు ఈడ్చుకొని పోయెద.. అందరును చూచి ఆనందింపగలరు..
జనమేజయా! పాండవులిట్లు ప్రచ్ఛన్నముగ ఏకచక్రపురమున నున్నకాలమున....
[ఇంకా వుంది]




*(గత సంచిక తరువాయి)*

ఉన్నవన్నీ గాజు తలుపులైనా ఒక విద్యార్థీ రాయి విసరలేదు. విద్యార్థులంతా శాంతియుతంగా ప్రవేశించాలని చూస్తున్నారు. అధికారులు, ఉపాధ్యాయులు శాంతియుతంగా ప్రతిఘటిస్తున్నారు. ఇల్లా ఓ గంట జరిగాక విద్యార్థులు ఆరోజుకి ఆందోళన విరమించుకొన్నారు. రాడికల్స్‌ని విద్యార్థులలో ఎందరు సపోర్ట్ చేస్తారో తేల్చే మీటింగ్ రెండ్రోజుల తరువాత జరుగుతుందని ఆరోజు జరిగే సర్వ విద్యార్థి సమావేశంలో విద్యార్థుల నిర్ణయాన్ని చూసి ఆపైన విద్యార్థులతో సంప్రదింపులు జరుపుతామని వైస్‌ఛాన్సలర్ అన్నాడు. రాడికల్ విద్యార్థి నాయకులు ఒప్పుకొన్నారు.

శంకరరావు ఇండియాలో ఎన్నో విద్యార్థుల ఆందోళనలు చూసాడు. గాంధీగారు నడిపిన శాంతియుత పోరాటం గురించి విన్నాడుగాని చూడలేదు. అతను చూసిన విద్యార్థుల ఆందోళనలు సగానికి సగం రౌడీతనంతో నిండి ఆదర్శాల ప్రమేయం లేనివి. కాని భారతదేశానికి కొన్నివేల మైళ్ల దూరంలో, గాంధీ నమ్మిన పద్ధతిలో పోరాటం సాగుతోంది. విద్యార్థుల క్రమశిక్షణ అనుసరించదగ్గది అనుకొన్నాడు.

రెండ్రోజుల తరువాత లంచ్ టైములో బ్రహ్మాండమైన విద్యార్థి సభ జరిగింది. పది పన్నెండువేలమంది విద్యార్థులు హాజరయ్యారు. శంకరరావుకి వనజ కనిపించింది. వెళ్లి వనజ పక్కన నిలబడ్డాడు విద్యార్థుల నాయకుడు సభ ప్రారంభించాడు.

"మన యూనివర్శిటీ అధికారుల ప్రవర్తన

---

***జరిగిన కథ - 4 :*** కొత్త జీవితం గడపటానికి స్వదేశం నుండి ఆస్ట్రేలియా వెళ్లిన శంకరరావుని, పార్వతిని – రంగస్వామి, ప్రొ. బ్రౌన్‌లు సాదరంగా ఆహ్వానించి వాళ్ల ఫ్లాట్‌కి తీసుకువెళ్తారు. పార్వతి టీచర్ ఉద్యోగానికి ప్రయత్నించి నిరాశ చెందుతుంది. తర్వాత కొన్నాళ్లకు ఒక బట్టల కంపెనీలో ఉద్యోగానికి చేరుతుంది. ఉన్నంతలో 'వినాయక చవితి' పండుగ జరుపుకుంటారు శంకరరావు దంపతులు. శంకరరావు పనిచేస్తున్న యూనివర్శిటీలోని విద్యార్థులు తమ జీతాలు తగ్గించాలని ఆందోళన చేస్తూంటారు.

---

అద్భుతం అని నేననను. కాని ఎడ్మినిస్ట్రేషన్ ఆఫీసులను ఆక్రమించడం ద్వారా రికార్డులను ధ్వంసం చెయ్యడంవల్ల మనం చెడ్డ పేరు సంపాదించుకొంటాం. పైగా ఆ విధమైన అరాచకం సృష్టించడంవల్ల మనకే హాని. అందుకని నేను దీన్ని వ్యతిరేకిస్తున్నాను" అన్నాడు.

తరువాత ఓ రాడికల్ విద్యార్థి చేతో ఓ పంది తలకాయను కర్రకు గుచ్చి పట్టుకుని "ఈ పిగ్ హెడ్ మన అధికారులందరి ఆలోచనా విధానాలన్నింటికి సింబల్. మన వైస్‌ఛాన్సలర్‌కి ఏదీ తొందరగా బుర్రకెక్కదు. ఆయన బుర్రలో ఎన్నో విషయాలు, తను వచ్చే యేడు ఏ దేశం వెళ్లాలిలాంటి విషయాలు, ఉంటాయి. అందుకని కొత్త విషయాలు అందులోకి చోటుచేసుకొని ప్రవేశించడం కష్టం. అల్లా వెళ్లనప్పుడు మనం చేయూతనిచ్చి ఆ విషయాలకి ఆయన హెడ్‌లోకి ప్రవేశం కలిగించాలి. అందుకే ఈ ఆక్రమణ" అంటూ చాలా ఉద్రేకంగా ఉద్రేకం కలిగించేలాగా మాట్లాడాడు.

ఆక్రమించాలనేవారు వద్దనేవారు కూడా చాలామంది మాట్లాడారు. ఒంటిగంటా నలభై అయిదైంది. విద్యార్థులింతవరకు అల్లరి చెయ్యకుండా ఇరువైపుల వాదాలు విన్నారు.

"వోటింగ్, వోటింగ్" అని ఒక్కసారి అరిచారు. "అవును. టైమైపోతోంది" అంది వనజ.

"దేనికి?" అనడిగాడు శంకరరావు.

"ఇక్కడ విద్యార్థులు ఒంటిగంటకు ఒంటిగంట యాభైకి మధ్య తీసుకొన్న నిర్ణయాలకే విద్యార్థులు బద్ధులని కాన్‌స్టిట్యూషన్ రాసుకొన్నారు. రెండింటికి క్లాసులు మొదలవుతాయి కదా! ఆ తరువాత చదువంటే శ్రద్ధలేనివాళ్లు క్లాసులు ఎగకొట్టి ఇష్టమొచ్చిన నిర్ణయాలు తీసుకోకుండా ఈ జాగ్రత్త! ఆపై నిర్ణయాలకి మొత్తం విద్యార్థి సమూహం బాధ్యత వుండదు. అవి వ్యక్తిగతమైన నిర్ణయాలైపోతాయి" అంది వనజ.

వైస్‌ఛాన్సలర్ మైక్ దగ్గరకు వెళ్లాడు. "ఈయన కెంత ధైర్యం!" అనుకొన్నాడు శంకరరావు.

శంకరరావుకి ఆరోజు అన్నీ ఆశ్చర్యాలే! ఒక అప్రాచ్య దేశంలో, గాంధీ బుద్ధుడు పుట్టని పాపపు గడ్డమీద, కేవలం రెండువందల సంవత్సరాలు చరిత్ర మాత్రమే కలిగిన ఓ దేశంలో ఒక పక్షం విద్యార్థులు, ప్రతిపక్షపు విద్యార్థులు మాట్లాడుతున్నప్పుడు వినదగు నెవ్వరు చెప్పిన అన్న ధోరణిలో పిల్లికూతలు కుక్కకూతలు కుయ్యక వినటం శంకరరావుకి ఆశ్చర్యం కలిగించింది. అంతకంటే ఆశ్చర్యం కలిగించిన విషయం ధైర్యంగా ఆ యూనివర్శిటీ వైస్‌ఛాన్సలర్ విద్యార్థుల నుద్దేశించి మాట్లాడటానికి ఆ అలజడి సమయంలో ముందుకు రావటం. అదే వీరులకి నిర్భీతికి ఆలవాలమైన భారతదేశంలో, తెల్లవాళ్ల గుళ్ళకు ఛాతి చూపించిన సాహసికులు సామాన్యులలో పుట్టిన దేశంలో, ఆ దేశపు మేధావి వర్గపు నాయకులైన విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులెవరు

రిజిస్ట్రార్స్ ఆఫీసు దగ్గరకు వెళ్ళేసరికి మెగాఫోన్లు పెట్టుకొని రాడికల్స్ గొడవ చేస్తున్నారు. అందులో బాబ్‌ని వనజని పోల్చుకొన్నాడు శంకరరావు. ప్రొ: బ్రౌన్ లోపలికి నడిచాడు. శంకరరావు గుంపులో కృష్ణకాంత్‌భట్‌ని చూసి అటువైపు నడిచాడు.

"రావూజీ రండి" అంటూ అతను పిలిచాడు. భట్ ద్వారా శంకరరావు మరికొన్ని విషయాలు విన్నాడు. దీనికి నాయకుడు లాంఫూర్ అన్నవాడుట. అతను మొనాష్‌లో ఎలిక్ట్రికల్ బి. యి. చదివాడట. వీడి బాధ పడలేక, రిసెర్చికి వీడు అప్లై చేసినా సీటివ్వలేదుట. "నాకు మంచి మార్కులు వచ్చాయి. సీటు ఎందుకివ్వరు?" అని అధికారులతో పోట్లాడి సీటు సంపాదించాడుట. ఒకసారి సిటీలో పోలీసులు, ఇతని ఉపన్యాసం వింటున్నవారిలో ఉద్రేకం ప్రేరేపించేదిగా వుందని ఇతను ఉపన్యాసంలో ఒకచోట "పోలీసు ... కొడుకుల్ని తన్నండి" అన్నాడని ఆరోపించి కోర్టుకు లాక్కుపోయారుట. ఋజువుగా అతని ఉపన్యాసం టేప్ చేసినది పెట్టారుట. ఇతను లాయర్ని పెట్టుకోకుండా తనకి తనే వాదించుకొని ఆ టేప్స్ అన్నీ కూడా పోలీసుల తయారీ అని అబద్ధపు టేపులని వాటి క్వాలిటీ వేరియేషన్స్ దృష్ట్యా కొన్ని కొన్ని భాగాలు పోలీసు స్టేషన్లో, తన గొంతుకని కొంచెం పోలిన మరో గొంతుకతో రికార్డు చేసారని వాదించాడుట. ఆశ్చర్యకరమైన విషయం - జడ్జి "పోలీసులది కుక్‌డప్ కేస్" అంటూ కొట్టిపారేసాడుట.

కృష్ణకాంత్‌భట్ యింకా కొన్ని విషయాలు చెప్పాడు – "గత సంవత్సరం లాంఫూర్ బృందం మూడ్రోజులపాటు రిజిస్ట్రార్స్ ఆఫీసుని ఆక్యుపై చేసి కొన్ని కాగితాలు తగలబెట్టారు అందుకని అతను ఒక సంవత్సరంపాటు యూనివర్శిటీ కాంపస్‌లో అడుగుపెట్టరాదని పెడితే జైల్లో పెట్టాలని కోర్టు నుంచి యూనివర్శిటీ తీర్పు పొందింది. ఇవాళ గుంపులో అతను లేడు. అదిగో ఆ పొడుగుజుట్టు అమ్మాయి అతని భార్య. మన యూనీలోనే చదువుతోంది అయితే వీళ్లకి పెళ్లి అంటూ జరిగే తతంగంలో నమ్మకంలేదు. అందుకని మనసులు కలవడమే పెళ్లి అనీ అందుకని తామిద్దరూ భార్యాభర్తలమని చెప్పి కలిసి వుంటున్నారు."

ఇంతలో మిసెస్ లాంఫూర్ "ఇంక ఆగకండి. ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసెస్‌ని ఆక్రమిద్దాం పదండి" అంటూ దారితీసింది. రాడికల్ విద్యార్థులంతా ఆమె వెంట నడిచారు. వాళ్లు లోపలికి వెళ్లలేకుండా ద్వారపాలకులలాగా ప్రొఫెసర్లు అడ్డునిలబడ్డారు. విద్యార్థులు తోసుకు ముందుకు వెళ్తుంటే ఉపాధ్యాయులు వెనక్కి తోసేస్తున్నారు.

ఉన్నట్టుండి మెగాఫోనులో "మన యూని, దార్కు కాసే బందిపోటు దొంగల్ని, స్టాఫ్ మెంబర్లుగా తీసుకోండి" అని అరిచారు ఎవరో. 'అవును" అక్కడి విద్యార్థులంతా ఏకగ్రీవంగా అన్నారు.

శంకరరావు ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

# మళ్ళీ మీ రోజువారీ పనులు మామూలుగా చేసుకోవాలని ఆతృతగా ఉందా మీకు?

# గ్లాక్సోస్-డి®

అలసటను ఎదుర్కొనేందుకు

వెంటనే శక్తిని సమకూరుస్తుంది.

గ్లాక్సోస్-డి తో మీరు మామూలుగా మీ ఇంటి పనులు చేసుకునేందుకు సిద్ధం కావచ్చు. గ్లాక్సోస్-డి మీ శరీరానికి కావలసిన ముఖ్యమైన శక్తిని అందజేస్తుంది. డాక్టర్లచే సిఫారసు చేయబడుతున్న గ్లాక్సోస్-డి, విటమిన్ డి, కాల్షియం, భాస్వరంతో బలపరచబడిన హైగ్రేడ్ గ్లూకోజ్.

గ్లాక్సోస్-డి అలసటను దూరం చేసి మళ్ళీ మీరు ఇంటి పనులు మామూలుగా చేసుకొనేందుకు కావలసిన శక్తిని సమకూరుస్తుంది.

**గ్లాక్సోస్-డి®**

**కుటుంబానికంతటికీ ఇట్టే శక్తినిచ్చేందుకు.**





విద్యార్థుల అలజడుల్లో వద్దు అని చెప్పటానికి వారి ముందుకు వెళ్ళిన గుర్తు శంకరరావుకి లేదు. అతని విద్యార్థిదశ స్వాతంత్ర్యం వచ్చాక మొదలైంది.

"విద్యార్థులకి నా మనవి! నా శక్తిమేరకు, ఈ యూనివర్శిటీకి సంబంధించినంతవరకు నేను అమలు జరుపుతూనే వున్నాను. అయితే ఎడ్మినిస్ట్రేషన్ సజావుగా వుండటానికి అన్యాయాలు జరగకుండా వుండటానికి ఏర్పరిచిన రూల్స్ అండ్ రెగ్యులేషన్స్ వల్ల ఆలస్యం జరుగుతూనే వుంటుంది. మీరు మీ సమస్యలను మా దృష్టికి తెచ్చాక మాకు కొంత టైమివ్వాలి. అదే నేను కోరేది. పైగా మీలో చాలామంది ఉద్యోగాలుచేసి డబ్బు దాచుకొని చదువుకోడానికి వచ్చారు. మీ రికార్డులను బాధ్యతారహితంగా కొందరు విద్యార్థులు తగలబెట్టే అధికారం మీరు వారికివ్వదల్చుకొన్నారో లేదో ఆలోచించుకొని మరీ వోట్ చెయ్యండి" అని వైస్‌ఛాన్స్‌లర్ కోరాడు. ఆపైన విద్యార్థి నాయకుడు "ఆక్రమించాలని కోరేవారందరు నా ఎడంవేపుకి వద్దనేవారందరు నా కుడివైపుకి రండి" అని కోరాడు. విద్యార్థులు రెండుగా చీలారు. విద్యార్థుల్నిటు రమ్మనిగాని, అటు రమ్మనిగాని ఎవరూ బలాత్కారంగా లాక్కుపోలేదు. లెక్క జరిగాక వద్దన్నవారు ఆక్రమించాలన్నవారికి రెట్టింపున్నట్టు తేలింది. ఆక్రమించటం సర్వవిద్యార్థి సంఘ నిర్ణయం కాదని తేలిపోయింది. శంకరరావు కదో మరపురాని అనుభవం.

ఆ సాయంత్రం పార్వతి ఆలస్యంగా వస్తుందని శంకరరావే జోనింటికి వెళ్లాడు బాబుని తీసుకువద్దామని. జోన్ శంకరరావుని లోపలికి పిలిచింది. మామూలుగా అయితే తలుపు దగ్గరే బాబుని అందించును. ఆవేళ "మిస్టర్ రావ్! మీరంతా భారతదేశంలో బతకలేక మా దేశం వచ్చారా మరి మా అబ్బాయి హారీ ఏమో వచ్చే యేడు వాడికి పద్దెనిమిది రాగానే ఇండియా వెళ్లిపోతానంటున్నాడు. తెలివైన వాళ్లంతా మీ దేశం నుంచి మా దేశం వస్తుంటే మా బుద్ధిలేని గాడిదలు మీ దేశం వెళ్తానంటున్నాయి. నువ్వో పారూ కొంచెం మావాడికి బుద్ధి చెప్పండి మీ దగ్గరికి వస్తే" అని కోరింది.

శంకరరావుకి ఏమనాలో తెలియలేదు. బుద్ధిలేని పాశ్చాత్యులు ఇండియా వెళ్తామంటారా? మరి భారతదేశ సంస్కృతితో ప్రభావితులైన పాశ్చాత్యులే మన దేశం వస్తారని, వాళ్లు చాలా పెద్ద మేధావులని అనుకొంటారు? "నువ్వో స్వామి గొప్పవాడని నమ్మకపోడం మూర్ఖత్వం. ఒక ఆస్ట్రేలియన్ కూడా ఆయన మహాత్ముడని పుస్తకం వ్రాసాడు" అని వాదనలలో కొందరు వాదించడం విన్నాడు. ఆ లాజిక్‌లో తనకి తప్పుందని ఇన్నాళ్లు తట్టలేదు. కానీ ఇవాళ అనిపిస్తోంది. మూర్ఖులు ప్రతి దేశంలోను వుంటారు. వాళ్లలో కొందరు ఇండియా వచ్చి మూర్ఖత్వంతోనో స్వార్థంతోనో పుస్తకాలు వ్రాస్తే ఆ పుస్తకాలు వేదాలలాగా శంకించడానికి వీలులేనివిగా, మనం తీసుకోడం మనకి కేవలం తెల్లతోలుమీదున్న గౌరవమేకాని వాటిలో సత్తా కాదేమో!

"నాకీ హెల్పు చేస్తారుకదూ!" అని జోన్ అడిగింది బాబు నిస్తూ.

"చెప్పి చూస్తాను" అన్నాడు శంకరరావు బాబు నందుకొంటూ.

శంకరరావు బాబుని తీసుకొని ఇంటికి వెళ్లాడు. మామూలుగా బాబుని తీసుకొని ఇంటికి వెళ్లేసరికి గుమ్మం దగ్గర తలుపు తీస్తూనో, అప్పుడే వచ్చి చీర మారుస్తూనో వుంటుంది పార్వతి. కాని ఆరోజు పార్వతి రావటం ఆలస్యం అయింది. శంకరరావే తలుపు తెరిచి లోపలికి వెళ్లి టి. వి. లో పిల్లల కార్యక్రమం పెట్టాడు. అది అర్థమయ్యేపాటి వయస్సు బాబుకి రాలేదు. కాని అది పెడితే గొడవ చెయ్యకుండా బుద్ధిగా కూర్చుంటాడు. శంకరరావు కిచెన్‌లోకి వెళ్లి చిన్న గ్లాసులో షెర్రీ వంచుకొని గుమ్మం దగ్గరకు వచ్చాడు.

పార్వతి బస్సు దిగి కాళ్ళీడ్చుకొంటూ వస్తోంది. అల్లా వస్తున్న పార్వతిని చూస్తుంటే శంకరరావు మనస్సు బాధపడింది. ఇంకో నెలా పదిహేను రోజుల్లో మొనాష్ టీచర్స్ కాలేజీలో జేరుతుంది. ఈ కూలీ జీవితం పార్వతికి తప్పుతుంది. తను కారు కొని పార్వతిని సుఖపెడతాడు!

## 6

ఫిబ్రవరి నెల వచ్చింది. పార్వతి టీచర్స్ కాలేజీలో కోర్సు చెయ్యటానికి సెలక్ట్ అయింది. వారానికి అయిదురోజులు. మూడురోజులు చదువు, రెండ్రోజులు టీచింగ్ ప్రాక్టిస్. తనలాంటి అనుభవం వున్నవాళ్లకి ప్రాక్టిస్ ఏమిటి అనుకొని నవ్వుకొంది పార్వతి. తనకి, అనుభవందృష్ట్యా సంవత్సరానికి నాలుగువేల డాలర్లు ఇవ్వటానికి విద్యాశాఖ నిర్ణయించింది. పూర్తి జీతమిచ్చి ట్రెయినింగ్ చెయ్యమంటే తనకేం నష్టం! ప్రతీ నెల జీతం వస్తుంది. ఏడాది చివర డిప్లొమా వస్తుంది.

ఏవిధంగా
చూసినా...

శ్రేష్ఠమైన డిటర్జెంట్.
సరసమైన ధర.

అదే ధరకు
1000 గ్రాం ప్యాకులపై
కట్-ఔట్ బొమ్మలు










...డిటర్జెంట్
పౌడరులలో
అత్యంత
లాభదాయకం

క్రికెట్ :కామెంటరీ దర్శిని + ఆట
వింటూనే ఆటను "చూడటానికి" సహాయపడుతుంది.
వివరాలకోసం మీ డీలర్‌ను సంప్రతించండి.

పాయింట్

MCA-PDP-60 Tel

చేరటానికి డాక్టర్ దగ్గర్నుంచి ఫిజికల్ ఫిట్‌నెస్ సర్టిఫికేటు తీసుకోవాలంటే శంకరరావు పార్వతిని తీసుకొని డాక్టర్ దగ్గరకు వెళ్ళాడు. ఆస్ట్రేలియాలో ఆడ డాక్టర్లు లేరు. ఎక్కడైనా ఒకరిద్దరుంటే వాళ్ళు ఇండియన్స్. ఇండియన్ డాక్టర్స్ చాలా దూరంలో వున్నారు. అందుకని దగ్గర్లో వున్న ఆస్ట్రేలియన్ మగ డాక్టర్ దగ్గరకే వెళ్ళారు, ఎపాయింట్‌మెంట్ తీసుకొని. ఆయన ఎదురువచ్చి లోపలికి తీసుకువెళ్ళాడు. శంకరరావుని విజిటర్స్ రూమ్‌లో కూర్చోమని పార్వతిని చెకప్ రూమ్‌లోకి తీసుకువెళ్ళి తలుపు వేసాడు. పావుగంట తరవాత పార్వతి బయటకు వచ్చింది. డాక్టరక్కడకక్కడే సర్టిఫికేటు టైపుచేసి సంతకంచేసి యిచ్చాడు. బిల్లు తరువాత పంపుతానన్నాడు. ఇంటికి వెళ్ళే దారిలో డాక్టర్ ఏమేమి చెక్ చేసాడు అని అడిగాడు శంకరరావు. అందులో కుతూహలం, అనుమానం వున్నాయి. పార్వతి గమనించింది. "రొటీన్ చెకప్ ... బరువు ... హైటు, లంగ్స్" అని జవాబిచ్చింది.

ఆ సాయంత్రం బాబుని తీసుకొని కృష్ణకాంత్‌భట్ వాళ్ళింటికి వెళ్ళారు శంకరరావు, పార్వతి. కృష్ణ తలుపు తెరిచాడు. అలిసిపోయినట్టుంది అతని మొహం అనుకొన్నాడు శంకరరావు.

"రండి!" అని లోపలికి ఆహ్వానించాడు. కూర్చున్నాక "మీరు రాక రాక వస్తే ... షీలకి వంట్లో బాగాలేదు...క్షమించాలి" అన్నాడు కృష్ణ.

"ఆవిడ లేచేవున్నారా?" అని అడిగింది పార్వతి.

"ఆఁ. ఆ గదిలో పడుకొంది."

"నేను లోపలికి వెళ్ళి పలకరించవచ్చా?"

కృష్ణ కాస్సేపు తటపటాయించి "తప్పకుండా! దాన్దేముంది. షీలకు కాస్త బోరు తప్పుతుంది" అన్నాడు. పార్వతి లోపలికి వెళ్ళింది.

షీల డబుల్‌కాట్ మీద పడుకొనివుంది. మొహమంత పీక్కుపోయుంది. దగ్గర్లో బేసిన్, మంచినీళ్ళు వున్నాయి. పార్వతిని చూసి నీరసంగా నవ్వింది.

"జ్వరమా?" అని అడిగింది పార్వతి.

"కాదు. నాసియా. వాంతులు వెళ్తున్నాయి, నిన్న పొద్దుటినుంచి ఏమీ తినాలనిలేదు. తినలేదు. కృష్ణ యూనికి వెళ్ళకుండా నాకు సేవచేస్తున్నాడు. ఇంతకూ కబుర్లు ఏమిటి?"

"నాకు మొనాష్ టీచర్స్ కాలేజీలో టీచర్స్ ట్రెయినింగు చెయ్యటానికి సీటు వచ్చింది. అయితే నాకు నేను అడిగినా, నాకు ఓక్లే హైస్కూలు ఇవ్వలేదు. ముర్రంబీనాలో ఇచ్చారు ప్రాక్టీసు."

"ఏ స్కూలైనా పరవాలేదు. కాస్త ఎగ్రెసివ్‌గా వుండాలి. కాస్త ఎట్రాక్టివ్‌గా తయారై వెళ్తే చాలు పని జరిగిపోతుంది. వీళ్ళకి కాంప్లిమెంట్స్ ఇవ్వటం ఓ దురలవాటు. మొహంమీదే నువ్వు రంభలా వున్నావ్ అంటారు. అన్నాక నువ్వు సరిగ్గా టీచ్ చెయ్యలేదు అనలేదు కదా" అంటూ నవ్వింది. ఆపైన "ఎక్స్‌క్యూజ్ మి" అంటూ బేసిన్‌లో వాంతి చేసుకొంది. పార్వతి నీళ్ళిచ్చింది. షీల పుక్కిలించి ఉమ్మేసింది. "కృష్ణ!" అని షీల పిలుస్తే శంకరరావుతో కబుర్లు చెప్తున్న కృష్ణ వచ్చి చూసి ఆ బేసిన్ క్లీన్ చేసి పెట్టాడు. "కృష్ణ! ఏమన్నా వండుకున్నావా?" అని అడిగింది.

"ఒకడిని ఏం వండుకోను. బ్రెడ్ తినేస్తాను."

"ఎన్నాళ్ళిలా?"

"రేపటికి నీకు మామూలైపోతుందికదా."

"పిచ్చి కృష్ణ! నాకోసం నువ్వు నిద్రాహారాలు మానేస్తే నిన్ను, నన్ను వీళ్ళు లవ్‌బర్డ్స్ అనుకొంటారు. అవునా పార్వతీ?"

పార్వతి ఆ మాటకి నవ్వి "మా భోజనం అయింది. మీ కభ్యంతరం లేకపోతే మా యింటికి భోజనానికి రండి" అంది కృష్ణతో.

"వద్దులెండి" అన్నాడు కృష్ణ.

"అయితే ఇక్కడే రైస్ పెడతాను, ఓ కూర



చేస్తాను" అంటూ పార్వతి కిచెన్‌లోకి వెళ్ళింది.

పార్వతి, శంకరరావు కబుర్లు చెప్తుంటే కృష్ణ భోంచేసాడు. పార్వతి ఇంటికి బయల్దేరే ముందర షీలతో "మీ పుస్తకాలు నోట్సులు వుంటే నేను కొంటాను. వేరే ఎవరికి మాటివ్వకండి. ఈ యేడాది పనికిరాకుండాపోయే పుస్తకాలు వెనక్కిచ్చేస్తాను" అంది.

"అల్లాగే. కొంచెం నెమ్మదించాక వెతికి వుంచుతాను. తీసుకొందురుగాని" అని షీల ప్రామిస్ చేసింది.

మర్నాడు శంకరరావు రంగస్వామితో కలిసి సెకెండ్‌హాండ్ కారు కొనటానికి వెళ్ళాడు. టి. వి. లో ఎడ్వర్‌టైజ్ చేసే కెవిన్ డెన్నిస్ లాంటి పెద్ద డీలర్స్ దగ్గరకు వెళ్ళారు. నాలుగు వందల డాలర్ల నుంచి కార్లు చూపించారు. కారు కొనటానికి అప్పు కూడా ఇప్పిస్తామన్నారు. శంకరరావుకి ఒక ఆరు వందల డాలర్ల కారు నచ్చింది అది కొంటానన్నాడు రంగస్వామితో. ఇన్‌స్టాల్‌మెంట్ పద్ధతిలో కొంటే అది ఎనిమిది వందల డాలర్లు అవుతుంది. అంటే ఏడాదికి ఆరు వందలకి రెండు వందలు వడ్డీ. చాలా ఎక్కువ వడ్డీ అన్నాడు రంగస్వామి.

"నిజమే కారు కూడా నాలుగు వందలకంటే చెయ్యదు" అని శంకరరావు ఒప్పుకొన్నాడు. "కాని వేరే మార్గం లేదు. మీ కారు నాకిచ్చి మీరు కొత్తది కొనుక్కుంటే తప్పించి."

"కొంటారా నా కారు?" రంగస్వామి సరదాగా అడిగాడు.

"మీ రమ్మాలేగాని తప్పకుండాను" అన్నాడు శంకరరావు.

డీలర్ వీళ్ళు తెలుగులో మాట్లాడు కొంటుంటే తెల్లమొహం వేసుకొని చూడటం మొదలుపెట్టాడు.

"ఈ కారు విషయం ఆలోచించుకొని మీకు తరువాత చెప్తాం. వస్తాం" అంటూ రంగస్వామిగారు బయటకు దారితీసాడు. కారు యూనివైపు డ్రైవ్ చేస్తూ సాయంత్రం ఓసారి మా యింటి వేపు రండి మాట్లాడుకొందాం" అని ఆహ్వానించాడు రంగస్వామి.

ఆ సాయంత్రం భోజనాలయ్యాక శంకరరావు పార్వతితో చెప్పాడు "రంగస్వామిగారి కారు కొందామనుకొంటున్నాను. మాట్లాడటానికి వాళ్ళింటికి వెళ్దాం" అని. పార్వతి బాబుని తయారు చేసి తను తయారై బయల్దేరింది. బాబుని ఇద్దరు చేతులు పుచ్చుకొని నడిపిస్తూ రంగస్వామి వాళ్ళింటికి వెళ్ళారు. వీళ్ళు వెళ్ళేసరికి వాళ్ళ భోజనాలు కూడా అయ్యాయి.

"శంకరరావుగారు మన కారు కొంటారుట" అన్నాడు, రంగస్వామి నాందిగా లక్ష్మితో.

"మంచిదే" అంది లక్ష్మి.

"ఎవరికి మనకి. పాపం వాళ్ళ మాటో!" అంది వనజ తల్లితో. ఆపైన శంకరరావుతో "మీరు ముందర రాయల్ ఆటోమొబైల్ క్లబ్ ఆఫ్ విక్టోరియాలో మెంబర్‌గా జేరండి. అప్పుడీ కారు దార్లో ఆగిపోతే వాళ్ళు వచ్చి బాగుచేస్తారు. లేకపోతే నియరెస్టు గిరాజ్‌కి లాక్కెళ్తారు. హాయిగా కొత్త కారు కొనుక్కోండి" అంది.

"వచ్చేయేడు కొంటామేమో! ప్రస్తుతానికిది చాలు. ధర చెప్పండి రంగస్వామిగారు."

"నాలుగువందల కిస్తాను. మీరామొత్తం మూడు నెలల్లో ఇవ్వచ్చు. మీకు డ్రైవింగ్ లైసెన్సు రాగానే అమ్ముతాను."

"నాకు ఇండియన్ కారు డ్రైవింగ్ లైసెన్సుంది. మాకు ఇంజినీరింగ్ కోర్సులో డ్రైవింగ్ నేర్పారు. దాన్ని ఇక్కడ ఆనర్ చేస్తారుట కదా?" అని అడిగాడు.

"అవును. వీళ్ళు ఇండియన్ లైసెన్సున్న వాళ్ళకి రోడ్ రెగ్యులేషన్స్ గురించి ఓరల్ టెస్టు పెట్టి పాస్ అయితే లైసెన్సు ఇస్తారు. అందుకని మనవాళ్ళు ఇండియాలో లంచం పెట్టి దొంగ లైసెన్సులు తీసుకువస్తున్నారు. స్టీరింగ్ పట్టుకోడం రానివాళ్ళు ఇండియన్ లైసెన్సు చూపించి, ఆస్ట్రేలియన్ లైసెన్సు పుచ్చుకొని ఏక్సిడెంట్లు చేస్తున్నారు. మన లైసెన్సుల పరువు పోతోంది. ఇప్పటికే ఇండియన్సు ఆనెస్టీ మీద వీళ్ళకి గౌరవం లేదు ఇల్లా కొన్నాళ్ళు సాగితే మన లైసెన్సుని గౌరవించటం ఆస్ట్రేలియన్ పోలీస్ మానుకొంటారు" అన్నాడు రంగస్వామి.

"డ్రైవింగ్ రానివాళ్ళు ఇక్కడ నేర్చుకోవచ్చు కదా!" అన్నాడు శంకరరావు.

# ప్రశ్నావళి

సి. జి. ఆర్. — గాజుల నర్సాపూరు

కె. రా. గారూ ఆడవారు దస్తాలకి దస్తాలు రాస్తూంటే మేము రాయలేకపోతున్నామే అనిపిస్తుంది; అయినా ఆడవాళ్ళలాగా అలాంటి చెత్తతో బోరుకొట్టించనందుకు సంతోషమని పిస్తుంది మీరేమంటారండి ?

★ మీరు రాయలేక బాధపడుతూ — 'అందని ద్రాక్షలు పుల్లన' అనుకుంటున్నారనీ; బోరు కొట్టించనందుకా సంతోష ప్రకటన వెనుక — ఆడలేక మద్దెల ఓడన్న వంక కనబడుతున్నారనీ— అంటానంతే !

కె. వి. ఆర్. — పాలకొల్లు

రామలక్ష్మమ్మా, నే తీసే సిన్మాలో మీకొక వేసం యివ్వాలని వుంది.

★ ఏం మీకు కేండిడేటు లేదా ? ! చూడండి సార్; వేషం ఇవ్వడం మీ ఇష్టంగాని వెయ్యాలో వెయ్యకపోవడమో నా ఇష్టంకద ! ఆయుద్యాయం లేని సిన్మా కంపెనీలు, అసల్లేని సినిమా కంపెనీలు, బోగస్ నిర్మాతలు, బోగస్ దర్శకులు ... యిలా ఎన్నిటినో చూస్తున్న నేను యిలా మీ 'గొప్ప' అవకాశం వదులుకుంటున్నాను — క్షమించండి - యిలా ప్రకటనే కొత్తవారు కావాలంటూ ఏ సినిమా పత్రికలోనో వెయ్యండి — మీ కెదురు డబ్బు పెట్టే ఎందరో శాల్తీలు వస్తారు.

కె. ఎస్. ఆర్. — నర్సీపట్నం రోడ్డు

...ఆ సమస్యకు పరిష్కారం మీకు రాయాలి. మీకు పెరసనల్ ఉత్తరం రాయాలనుకుంటున్నాను.

★ శుద్ధదండుగ. వ్యక్తిగత సమస్యలకి, వ్యక్తిగతంగా సమాధానాలు నేను రాయను. క్షమించండి.

జె. జె. ఎల్. — కదిరి

ఇతరులకు యింటి గుట్టు బయట పెట్టకూడదని చెప్పి తమ యింటి గుట్టు తామే బయటపెట్టువారిని ఏమనాలి ?

★ సాధారణంగా స్నేహంలోను, ప్రేమలోను స్వంతగోడు బయటివారికి చెప్పుకుంటారు. ఇంట్లో రక్షణ, ఆదరణ అభిమానం యిచ్చేవాళ్ళు కొరవడినప్పుడు కూడా — యిలా యింటి కబుర్లు ఆప్యాయత కనబరచినవారి దగ్గర బయట పెట్టుకోడం జరుగుతుంది. అంతేగాని తనవాళ్ళని తానే కించపరచాలని కాదు — యిలా చెప్పుకునే వాళ్ళని చూసి జాలిపడాలి. ఈ చెప్పినవాటిని అందరి దగ్గిరకీ మోసేవాళ్ళే — అసలు నిందితులు. స్నేహపాత్రత, స్నేహపు విలువలు, తెలియనివాళ్ళన్న మాట. కడుపులో దాచుకోవలసిన మాట కాకిలాగా అరిచేవాళ్ళు స్నేహితులు కారు. అలా దాని కూడా మాటలుపడే నాబోటివాళ్ళూ వుంటూవుంటారు- అందరిదగ్గిరా 'ఇది రహస్యం సుమా' అని చెప్పేసి 'నువ్వు చెప్పావు' అంటూ నోరు మూసుకున్న వాళ్ళమీద పడుతూవుంటారు కొందరు జాణలు. అందుకే — స్నేహంలోనైనా చుట్టరికంలోనైనా— 'గౌరవం చెడని దూరం' అట్టేపెట్టుకోవాలి. అది ఉత్తమ పద్ధతి.

వి. ఎస్. ఎమ్. — కాకినాడ

మీ కింకో జీవితకాలం సాంక్షన్ చేస్తే ఏం చేస్తారు ?

★ ఈ జీవితకాలం లోకం చూస్తూ గడిపేస్తాను; యింట్లో గడపడానికి యింకో జీవితకాలం — ప్రసాదిస్తే !

డి. ఎస్. ఆర్. - దోమంతునిగూడెం

ఇదివరలో నా లెటర్‌కి జవాబు రాయలేదు. మీకు ప్రశ్నకు ఫీజుందా ? లేక ఆశ్రితపక్షపాతం వుందా ? నేనీ మధ్య పెళ్ళిచూపులలో ఓ అమ్మాయిని చూశాను. అమ్మాయినచ్చలేదు. ఆమె చెల్లెలు నచ్చింది. ఆమె నన్ను తిరస్కరిస్తుందని వుంది.

★ కాస్త పౌరుషం వున్నదైతే అంతే చేస్తుంది ! అయినా పెళ్ళికి చూడపిల్చిన పిల్లని చూసిరాక — చుట్టుపక్కలవారిలో సెలక్షన్ ప్రారంభించడానికి — మీకు ఎబ్బెట్టుగా తోచలేదా ! !

జె. ఆర్. — పొన్నూరు

ఇప్పటికాలంలో ప్రేమికుల సరసాలు సరదాలు తీర్చుకుందుకు హోటల్స్ పార్కులు సినిమాహాల్లు నడుస్తున్నాయి. ఇవి లేని వెనకటికాలమందు ఎలా సాగేవి అక్కయ్యా ?

★ చిట్టి రాజేశ్వరీ ! పూటకూళ్ల కొంపల్లోనూ, చెరువు గట్లవెంట పొలాల్లోనూ సాగేవేమోమరి. అయినా ప్రేమించుకున్నంత మాత్రాన సరసాలు సరదాలు తీర్చేసుకుంటే — ఇక పెళ్ళి తరవాతకేం మిగుల్చుకుంటారు ? ! ప్రేమలో హుందాతనం వుండాలి. ఒకరిపై ఒకరికున్న యిష్టం గౌరవం పెరగడానికి ప్రేమించుకునే కాలం దోహదం చేయాలేగాని నేటి సినిమాల్లోలాగా ద్వంద్వార్థపు పాటలూ మాటలూ దొర్లుడులూ, పరుగు పందేలూ—అయ్యేక క్షమించు రాధా అనేయడానికి కాదు. (నిజానికి నాకెప్పుడూ అనిపిస్తూవుంటుంది — పెళ్ళికి ముందింత స్వేచ్ఛా ప్రణయినిలాగా ప్రేమించిన వ్యక్తితో గడిపిన అమ్మాయిమీద ఏ మాత్రమైనా గౌరవం మిగులుతుందా — ఆ అబ్బాయికని !)

జె. బి. ఆర్. — మొలగవల్లి

కాలువ ననుసరించిపోతే నది — నది ననుసరించిపోతే సముద్రం దొరుకుతుంది. మరి ప్రేమను అనుసరించిపోతే ?

★ కౌపీన సంరక్షణార్థం అయంపటాటోపమ లాగా యిసిగిపోవడంతప్ప ఏం దొరకదు — ప్రేమ— ప్రేమతోపాటు పెళ్ళి, పెళ్ళితోపాటు సంసార జంజాటం ! దాన్నీదలేక విరక్తి, విరక్తికి విరుగుడగా—సన్యాసమో వ్యసనమో ఎందుకొచ్చిన గొడవ ? ప్రేమించకండి ! పెళ్ళి చేసుకోండి !

డి. ఆర్. ఆర్. — విశాఖపట్నం

మాట్లాడ్డం తక్కువ వినడం ఎక్కువ చేయాలంటారెందుకు ?

★ ఓ క్షణం ఆలోచన ఓ గంట మాటలు మిగులుస్తుంది. ఆలోచనకి నాంది — వినడం ! అందుకని అలా అంటారు.

-కె. రామలక్ష్మి



"ఆ విషయం మా అమ్మ నడగండి. నేర్పేవాళ్ళకి నూటయాభై నుంచి రెండువందల డాలర్ల దాకా ఇవ్వాల్సివస్తుంది. ఇంతా యిచ్చాక ఎన్నిసార్లు వెళ్ళినా పారలెల్ పార్కింగ్‌లోనో, త్రీపాయింట్ టర్న్‌లోనో ఫెయిల్ అవుతారు. ఒకవేళ పొరపాటున టెస్టులో ఏ మూడోసారో పాస్ అయినా వచ్చేది ప్రొబేషనరీ లైసెన్సు. ఆ పీరియడ్‌లో స్పీడు లిమిట్ దాటినందుకు, అంబులెన్స్‌కి దారి ఇవ్వనందుకు పాయింట్లు పోయి ఆపైన లైసెన్సు ఎగిరిపోతుంది. మ్రూసు పోసీడు కథ మళ్ళీ మొదలు. అదే ఇండియా నుంచి లైసెన్సు తెచ్చుకొని, ఇక్కడ ఓరల్ టెస్టు లాగించేస్తే పర్మనెంటులైసెన్సు సంపాదించవచ్చు. మీ కిండియాలో లైసెన్సిచ్చి ఎన్ని సంవత్సరాలైంది ?" అని అడిగింది వనజ.

"మూడు." చెప్పాడు శంకరరావు.

"అయితే, మీకు పర్మనెంటు లైసెన్సిస్తారు. పర్మనెంటు లైసెన్సున్నవాళ్ళు ఎవరికైనా నేర్పొచ్చు. పార్వతిగారు మీదగ్గర నేర్చుకోవచ్చు."

"బాబోయ్ !" అంది పార్వతి.

"ఏం ?" అని అడిగింది నవ్వుతూ లక్ష్మి.

"ఈయనకి చాలా షార్ట్ టెంపర్."

"పోనీ అయనదగ్గర నేను నేర్చుకోనా ? నన్ను కేకలు వెయ్యకుండా నాకు డ్రైవింగ్ నేర్పుతారేమో చూస్తాను !" అంది వనజ.

పార్వతి మాట్లాడలేదు.

"మీరు లైసెన్సు తెచ్చుకొన్నారా ?" రంగస్వామి అడిగాడు.

"తెచ్చాను" శంకరరావు జవాబిచ్చాడు.

"మీరు రేపు పోలీసు స్టేషన్‌కి ఫోన్ చేసి టెస్టుకి టైమ్ ఫిక్స్ చేసుకోండి. వాళ్ళు ఏ పదిహేను రోజుల తరువాతో ఎపాయింట్‌మెంటిస్తారు" అని సలహా ఇచ్చాడు రంగస్వామి.

"ధర పెటిల్ అయినట్టేనా ?" అంది వనజ కల్పించుకొంటూ.

"ఈ ఆస్ట్రేలియాలో ఉండటం కాదు కాని నీకు అక్కర్లేని విషయం లేకుండా తయారయ్యావు" అని విసుక్కుంది లక్ష్మి.

"రంగస్వామిగారు చెప్పాక నేను బేరం ఆడ్తానా ?" అని నవ్వాడు శంకరరావు. ఓ పాతికైనా తగ్గించమని అడగరాదా అనుకొంది పార్వతి.

"మీ దగ్గర ప్రస్తుతం డబ్బుండి ఉండదు కనక మూడు వందల యాభై డాలర్లు చేసుకోండి. యాభై స్నేహితుడికిచ్చే కన్సెషన్" అన్నాడు రంగస్వామి.

"థాంక్స్" అన్నాడు శంకరరావు.

/ఇంకా వుంది/

*గుడిమల్ల*
*భరత్‌భూషణ్*



గుడిమల్ల భరత్‌భూషణ్‌కి హైదరాబాదు జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ యూనివర్సిటీలో ఫొటోగ్రఫీలో డిప్లొమా ఉంది. ఉస్మానియా బి.ఎ. కూడా ఉంది.

ఫొటోలు తియ్యటమే కాక రంగులతో బొమ్మలు వెయ్యటం కూడా భరత్‌భూషణ్‌కి ఇష్టం.

ఇరవయినాలుగు సంవత్సరాలు. రెండు వన్‌మాన్‌షోలు – స్వంత ఊరు వరంగల్‌లో, ఉంటున్న ఊరు హైదరాబాద్‌లో – నడిపాడు.

"కాండిడ్ ఫొటోగ్రఫీ" అంటే ఎక్కువ ఇష్టం.

# జి. వి. జి. పేజీ

## "కమలమ్మ కమతం"లో రాముడి కాబోయే భార్య

కాంతం (పల్లవి), మంగమ్మ (నిర్మల) రావడం చూసి కమలమ్మ (జయంతి) లోపల్నించి వస్తూ, "ఏం, మంగమ్మా? బావున్నావా? ఈ పిల్లెవరే?" అంది.

"నా మనవరాలండీ – కూతురు కూతురు. మన రాముడికిచ్చి పెయ్యాలండి" అంది మంగమ్మ.

ఇంతలో అక్కడికొచ్చిన రాముడు (కృష్ణంరాజు) "అవిరిద్దరూ ఎందుకొచ్చారే ఇక్కడికి?" అని అడిగాడు, ఎలాగైనా విషయం కాంతం నోటితో చెప్పించాలని.

"తవర్ని ఓ పాలి సూసెల్దామని వచ్చానండి. యియ్యాల యెల్లిపోతన్నానండి" అంటూ రాముడికి పరోక్షంగా జవాబు చెప్పింది కాంతం.

"ఇంత తొందరేమొచ్చిందే?" అడిగాడు రాముడు.

కాంతం "నేను వచ్చి అప్పుడే అయిదు రోజు లయింది కదండీ? ఈ ముసల్ది, నేను–ఆ గుడిసెలో మగ్గుతున్నామండి. పెళ్ళవని పిల్లని–పరాయింట్లో ఎన్నాళ్ళుంటానండి?" అంది, కమలమ్మ నుద్దేశించి.



''పరాయిళ్ళేమిటే ? రేపు కట్టుకోబోయే మొగుడింటికొచ్చావు'' అంది కమలమ్మ కాస్త మందలింపు ధోరణిలో.

''ఈ మడిసిని కట్టుకొని ఎవరేగ్గలరండి ? అటు మొన్న అగపడ్డాడు. మళ్ళీ అయిపులేదు. యిలాంటి మడిసిని కట్టుకుంటే – యీ ాన సల్లాని తో నేను కాపురం సెయ్యాలండి'' అంటూ కాంతం – కమలమ్మ కమతాన్ని కంటికి రెప్పలా చూసుకోవడమే తప్ప – మరో ప్రపంచం ఎరగని రాముడ్ని కట్టుకుంటే కలిగే కష్టనష్టాల్ని వివరించింది.

ప్రత్యగాత్మ దర్శకత్వంలో అనుమోలు వెంకట సుబ్బారావు నిర్మించే ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ ''కమలమ్మ కమతం'' ఈస్ట్‌మన్ కలర్ చిత్రంలో గిరిబాబు, అల్లు రామలింగయ్య, వంకాయల, జయభాస్కర్, విజయలలిత, జయమాలిని ఇతర పాత్రధారులు. పి. ఎస్. రావ్ రచయిత. చలపతిరావు సంగీత దర్శకుడు. సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడు. కళ: జి. వి. కృష్ణారావు. కూర్పు : కృష్ణస్వామి, బాలు. నిర్మాణ నిర్వహణ ; ఎ. పూర్ణచంద్రరావు. సహదర్శకుడు : మోహన్‌గాంధి. సహకార దర్శకుడు : ఎ. డిమ్మిటాన్. సహాయ దర్శకుడు : సుధాకరరెడ్డి. డిసెంబర్‌లో నవయుగ ద్వారా విడుదలయ్యే చిత్రమిది.



'మరో సీత కథ'లో జయమాలిని

## సిసలైన అనుకరణ

''సుప్రసిద్ధ దర్శక నిర్మాత వి. శాంతారాం గారికి నేను ఏకలవ్య శిష్యుడ్ని'' అని ఘనంగా చెప్పుకునే దర్శక నిర్మాత బి. కె. ఆదర్శ్ – చిత్ర నిర్మాణ విషయంలో శాంతారాం అడుగుజాడల్లో నడవకపోయినా – ఒక్క విషయంలో మాత్రం ఆయన్ని ఆదర్శంగా తీసుకున్నాడు. శాంతారాం తన భార్య సంధ్యతో చిత్రాలు తీసినట్లే ఆదర్శ్ కూడా అతని భార్య జయమాలతో చిత్రాలు తీస్తున్నాడు.

'రావణుడే రాముడైతే'లో అక్కినేని

## "రావణుడే రాముడయితే"లో అంతరాత్మ ప్రబోధం

నిద్రపోతున్న నాగులు – వికటాట్టహాసం వినిపించి, కళ్ళు తెరిచాడు. ఎదురుగా కనిపించిన ఆకారాన్ని చూసి, "ఎవరు? ఎవరు నువ్వు?" అన్నాడు.

"నేనే. లోపలివాణ్ణి. ఇది మంచి, చెడు అని చెప్పే నీలోవాణ్ణి. అదే, గురూ – అంతరాత్మని."

"నువ్వా! లోపలివాడివి బయట కెందు కొచ్చావ్?"

"ఎందుకా? నువ్వు నన్నెప్పుడూ చూశ్శేదు కదా? నువ్వు నన్ను చూసినట్టూ ఉంటుంది; నేను నీతో మాట్లాడినట్లూ ఉంటుందని. అయినా, నువ్వు చేస్తున్నది ఏం బాలేదు, గురూ!... అదే. రత్తాలు విషయం. ఆ పిల్ల నిన్ను ప్రేమిస్తుంది. నువ్వేమో ఏం పట్టించుకోవడంలేదు. ఇది చాలా అన్యాయం, గురూ!"

"బావుంది... నా మనసు తాయారు మీదుంది."

"ఆ పిల్ల మనసు నీమీదుందే!"

"ఉంటే – నన్నేం చెయ్యమంటావ్?"

"ఏదో ఒకటి చెయ్యాలి. ఆడపిల్ల మనసు బాధపెట్టడం మంచిదికాదు."

"ఆఁ... నీకేంలే. ఏమైనా చెబుతావ్. నువ్వెళ్ళు!"

"సర్లే... బాగా అలసిపోయినట్టున్నావ్. పడుకో!"

తాయారు (జయచిత్ర) ని నాగులు, రత్తాలు (లత) ని అంతరాత్మ కోరుతోంది. ఎవరు ఎవరికి ఏవౌతారో?

నాగులుగా ఎ. ఎన్. ఆర్. నటించే లక్ష్మీ ఫిలిమ్స్ కంబైన్స్ "రావణుడే రాముడైతే" స్కోప్ కలర్ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం : దాసరి నారాయణరావు. జి కె.



'భైరవి'లో గీత

## జి. వి. జి. పేజీ

వెంకటేశ్, కె. ఎస్. మణి, వాసి, బాలు – సంగీతం, ఛాయ, శిల్ప, కూర్పు శాఖలను నిర్వహిస్తున్నారు. నిర్మాత : ఎస్. ఆర్. అనూరాధాదేవి. సమర్పణ : కృష్ణవేణి.

## దుర్గమ్మ దూకుడు "వియ్యాలవారి కయ్యాలు"లో

విష్ణుప్రియా ఆర్ట్ పిక్చర్స్‌వారి స్కోప్ కలర్ చిత్రం సెట్‌లో హరిప్రసాదరావు పాత్రలో నాగభూషణం, దుర్గమ్మ పాత్రలో సూర్యకాంతం ఉన్నారు. డైరెక్టర్ కట్టా సుబ్బారావు ఆజ్ఞ మేరకు వెంకట్ కెమెరాకు చలనం కలిగించారు.

"ఏమిటీ! అంత దూరం వెళ్ళి, వాళ్ళు కానంటే సరేనని భోంచేసి – తిరిగి వచ్చేస్తావా? ఆ మాత్రం 'ఆలోచన లేదయ్యా నీకు?" అంది దుర్గ.

"పిల్ల నెత్తుకుని పోయినవాడు అల్లుడే కదే!" అని గొణిగాడు హరిప్రసాదరావు.

"అల్లుడైతే మాత్రం–నా ఇంట్లో ఇల్లరికం ఉండడానికి ఒప్పుకోని, నన్ను మోసం చేసి – అమ్మాయిని కాపురానికి తీసుకుపోతాడా? తరతరాలుగా అల్లుళ్ళను ఇల్లరికం తెచ్చుకుంటూన్న వంశమే మాది? నా వంశ మర్యాదను ఇలా మంట కలుపుతాడా? చూస్తాను. అతన్ని ఎలా దోవకి తెచ్చుకోవాలో నాకు తెలుసయ్యా! రత్తాలూ...



'వజ్రాల వేట'లో ఆరతి, అనంతనాగ్

ఒరే రత్తిగా! అల్లుడుగారు తిరిగిచ్చేసిన లాకట్టు వస్తువులన్నీ ఊరంతా గాలించైనా సరే – మళ్ళీ మనింటికి తెచ్చేయ్. వాళ్ళు మొత్తుకుంటే పట్నం వెళ్ళి ఆయనగారితోనే చెప్పకోమను. రామిగాడికి పొలం కౌలుకిచ్చాడు కదా – వాణ్ణి తరిమేసి చేను ఇంకొకడి కివ్వు."

"దూకుడొద్దు, దుర్గా."

"ఈ దూకుడు లేకపోతే మనకి మిగిలేది మూకుడే – ముష్టెత్తుకోడానికి."

కృష్ణ, జయప్రద నాయకా నాయికులైన ఈ చిత్రంలోని సత్యం స్వరకల్పన చేసిన ఆరు కమ్మని పాటల చిత్రీకరణను ఎ వి. ఎం. స్టూడియోలో ఇటీవల పాత్రికేయులకు చూపించారు నిర్మాతలు జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి, నూరి రంగయ్య.

'ఇద్దరూ అసాధ్యులే'లో కృష్ణ, గీత



విశ్వవిఖ్యాతనటసార్వభౌమ డాక్టర్ యన్.టి.రామారావు సమర్పించు

తప్పక చూడండి!

రవిచిత్ర ఫిలిమ్స్




నిర్మాత: వై.వి.రావ్ దర్శకత్వం: యస్.డి.లాల్

NAVRANG

పూర్ణా రిలీజ్

## రాజ్‌కపూర్ అల్లుడుగా అసిస్టెంట్

''సత్యం శివం సుందరం'' చిత్రానికి సహాయ దర్శకుడుగా పనిచేసిన బన్నీకి రాజ్‌కపూర్ పుత్రిక రీమాతో డిసెంబర్ 5న వివాహ నిశ్చితార్థం జరగనున్నది. నటుడు రాజేంద్రకుమార్ పుత్రుడు ఈ బన్నీ. అసలు పేరు మనోజ్‌కుమార్. స్క్రీన్ నేమ్ – కుమార్ గౌరవ్. అతనిప్పుడు ఆర్యన్ ఫిలిమ్స్ ''లవ్ స్టోరీ'' అనే టీన్‌ఏజ్ మూవీకి దర్శకత్వం నెఱపుతున్నాడు. దీనికి రాజేంద్ర కుమారే నిర్మాత.

## జి. ఏ. జి. పే జీ

రాజేంద్రకుమార్ మూడు దశాబ్దాల క్రితం హెచ్. ఎస్. రావైల్‌కు అసిస్టెంట్ డైరెక్టర్‌గా పనిచేశాడు. రావైల్ కొడుకు రాహుల్‌ను తన తదుపరి చిత్రానికి దర్శకుడుగా నియమించాడు రాజేంద్రకుమార్. ఇందులో సులక్షణా పండిట్ చెల్లెలు విజయత నాయిక.

షమ్మీకపూర్ కొడుకు కూడా రాజ్‌కప అసిస్టెంట్. డింపిల్ అన్న రాజా కపాడి ప్రాణ్ కొడుకు సునీల్ సికంద్ – మన్‌మో దేశాయ్‌కి అసిస్టెంట్లుగా, అశోక్‌కుమార్ పుత్ర అరూప్ గంగూలి – బాసు చటర్జీ అసిస్టెంట్ స్వర్గీయ ముఖేష్ కొడుకు నితిన్ ముఖేష్ హృషికేశ్ ముఖర్జీ సహాయకుడుగా పనిచేస్తున్నా



"ఎంకి—నాయుడుబావ'లో వాణిశ్రీ, జానకి

# సినిమా విశేషాలు

## వీనస్ కంబైన్స్‌కు యిరవై రోజులు

శ్రీ అక్కినేనితో మూడు విజయవంతమైన చిత్రాలను నిర్మించిన వీనస్ కంబైన్స్ అధినేత (శ్రీ గోవిందరాజన్) తమిళంలో ఘనవిజయాన్ని సాధించిన ముక్తా ఫిలింస్ వారి "అండమాన్ కాదలి" చిత్రాన్ని...ఈ నెల అయిదున అన్నపూర్ణ స్టుడియోస్‌లో ప్రారంభించారు.

తొలి షెడ్యూలు నవంబరు యిరవై అయిదు వరకు జరుగుతుందని, నిర్మాణత శ్రీ ప్రతిభాశాస్త్రి తెలిపారు.

శ్రీ నాగేశ్వరరావు ... కుమారి వాణిశ్రీ పాల్గొనే యుగళగీతాన్ని, రమాప్రభ ... అల్లు రామలింగయ్య పాల్గొనే స్వారస్య గీతాన్ని తొలి షెడ్యూలులో చిత్రీకరించి, మరో నాలుగు పాటలను అండమాన్ దీవిలో చిత్రీకరించనున్నట్లు, నిర్మాత శ్రీ గోవిందరాజన్ చెప్పారు. ఈ చిత్రానికి విక్టరీ మధుసూదనరావు దర్శకులు.

వీనస్ కంబైన్స్ డిశంబరులో అండమాన్ దీవికి బయల్దేరబోతున్నట్లు, దర్శకులు శ్రీ వి. మధుసూదనరావు చెప్పారు.

డిశంబరు 20 నుంచి జనవరి 5 వరకు అక్కడ జరిగే మలి షెడ్యూలులో శ్రీ నాగేశ్వరరావు ... కుమారి వాణిశ్రీగార్లతో బాటు ప్రభాకరరెడ్డి, చంద్రమోహన్, లక్ష్మిశ్రీ, రమాప్రభ, అల్లురామలింగయ్య పాల్గొనగలరని తెలిసింది.

"అండమాన్ కాదలి" చిత్రానికి, ఇళయరాజా కమ్మటి సంగీతాన్ని సమకూర్చి, విజయానికి చాలావరకు తోడ్పడినట్టే ... తెలుగు చిత్రానికి మహదేవన్ మధుర సంగీతాన్ని సమకూర్చిన ...జాన్ని, ఈ రచయిత విన్నాడు



ఈ రంగుల సంగీత వైభవానికి ఆచార్య ఆత్రేయ, మహదేవన్, బాలకృష్ణ, శాస్త్రి, కోదండరామిరెడ్డి ... బుల్లిరెడ్డి ప్రధాన సాంకేతిక సారధులు.

శ్రీ గోవిందరాజన్ నిర్మిస్తున్న, శ్రీ మధుసూదనరావు రూపొందిస్తున్న వీనస్ కంబైన్స్ వారి యీ కొత్తతరహా చిత్రాన్ని, నవయుగ పంపిణీ చేస్తారు.

## జయమాలినికి రక్తంతో తడిపిన ప్రేమలేఖ!

జగన్మోహినిగా బహుజనప్రియమైన జయమాలినికి ఓ రెడ్ లెటర్ వచ్చిందట ఇటీవల. ఆ లెటర్‌ను చించగా ఈ క్రింది విషయం బయట పడిందట. "జగన్మోహినీ! జయమాలినీ! నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. అందుకు నిదర్శనంగా నా రక్తంతో తడిపిన ఈ వుత్తరాన్ని వ్రాస్తున్నాను. స్నేహమే చేస్తావో, ద్రోహమే చేస్తావో నాకు తెలియదు. నా ఆశను నిరాశ చేయ ప్రయత్నిస్తే నిన్ను ఎత్తుకుపోగలను. జాగ్రత్త" అని వుందట. ఇలాంటి వుత్తరాలు కొత్తగా చదివితే భయపడాలిగానీ, రోజూ చదివే వాళ్ళకెందుకు భయం? కాసేపు ఆ పిచ్చభిమాని వుత్తరాన్ని చదువుకుని నవ్వుకుంటారు సినిమా తారలు. జయమాలిని కూడా అదే పని చేసుంటుంది. స్టార్ క్రేజ్ ఎంతటి సాహసాన్నైనా చేయిస్తుందనడానికి ఈ వుదాహరణ చాలదా!

'కరుణామయుడు'లో వెన్నిరాడై నిర్మల, సురేఖ, అనిత





'కోరికలే గుర్రాలయితే'లో మోహన్‌బాబు, జయలక్ష్మి, చంద్రమోహన్

## పెరిగాడు పొడుగు మనిషి !

ఆరడుగుల మనిషి, ఆజానుబాహు కృష్ణంరాజు మరో అడుగు పెరిగారు. పొడుగులో కాదు, పాపులారిటీలో. "మన వూరి పాండవులు" చిత్రంలో కృష్ణగా కృష్ణంరాజు నటన మరువలేము. అగ్రజా! ఇది అరవైయ్యో తప్పు అంటే షష్ఠిపూర్తి అని తన అన్న రావు గోపాలరావు నుద్దేశించి పలికే సన్నివేశంలో రెబల్‌స్టార్ సంభాషణం అద్భుతం. "పల్లె నిదరోయింది" అనే అర్థాన్ని స్ఫురింపచేసే పాటలో కృష్ణంరాజు ప్రదర్శించిన హావభావాలు హాట్స్ ఆఫ్. శ్రీ దాసరి సృష్టించిన "రుద్రయ్య" పాత్రను బహాదా ప్రశంసనీయంగా పోషించి భేష్ అనిపించుకున్న కృష్ణంరాజుగారికి "మన వూరి పాండవులు" చిత్రంలోని కృష్ణ పాత్ర మరో కలికితురాయి. సాఫ్ట్ కారెక్టర్స్ అందరూ వేస్తారు. సటిల్ పెర్‌ఫారమెన్స్ కొందరే చేస్తారు. ఆ కొందరిలో కృష్ణంరాజుగారు ఒకరు అనడానికి కృష్ణ పాత్ర ప్రత్యక్ష తార్కాణం.

## రంగనాథ్ కొక మంచి సలహా !

నో డౌట్ రంగనాథ్ ఈజ్ ఎ మెచూర్డ్ ఆర్టిస్ట్. కొన్ని పాత్రలకు రంగనాథ్ అతికినట్టుగా మరొకరు అతకరు. చక్కటి నటనను ప్రదర్శించగలిగిన ప్రతిభ వున్న రంగనాథ్ ఒక విషయంలో ఇకనుంచైనా జాగ్రత్త వహిస్తే, మచ్చలేని చంద్రుడిగా మరింత రాణించడానికి అవకాశం వుంటుందని పల్వురి అభిప్రాయం. మేకప్ విషయంలో రంగనాథ్ తగిన శ్రద్ధ తీసుకోవడం అత్యవసరం. వీలైనంతవరకూ లైట్ మేకప్ చేసుకుంటే బాగుంటుందేమో. "రామచిలక" చిత్రం చూశాక, ఒక మంచి మిత్రుడిగా ఈ నిజాన్ని తెల్పడం భావ్యం అని తలచి చనువుతో వ్రాస్తున్నాను. అపార్థం చేసుకోరని నా నమ్మకం.

– జనప్రియ

## లక్ష్మి ఫిలింస్ కంబైన్స్‌లో "షావుకారు" జానకి

నేటి స్టార్ డైరెక్టర్ శ్రీ దాసరి నారాయణరావు చిత్రీకరణలో ... లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ నిర్మిస్తున్న "రావణుడే రాముడయితే" స్కోప్ వర్ణ చిత్రంలో శ్రీమతి షావుకారు జానకి కొత్తతరహా పాత్రను పోషించడం ... గమనార్హం.

ఇంతవరకు అక్కినేనిగారికి సహధర్మచారిణిగా పాత్రలు నిర్వహించిన, "షావుకారు" జానకి, ఇప్పుడు తల్లిగా నటించడం, కొత్తదనమేగా, మరి.

"మీరు ... అక్కినేనిగారి తల్లిగా ఎలా అంగీకరించారు" అని నేను ప్రశ్నించాను.

ఆమె చెప్పిన సమాధానం ఎంతో సమంజసమైనదని ప్రేక్షకులు అంగీకరిస్తారు.

"ఆర్టిస్టు ఫలానా పాత్ర అయితేనే పోషించాలి అని భీష్మించుకుని కూర్చుంటే ... ఆ నిర్ణయం అపకారానికే దారితీసే ప్రమాదం వుంది. గనుక... పాత్రలో పస.... "పెప్" వుంటే ... తల్లి అయినా, ఇల్లాలయినా చెయ్యడానికి అభ్యంతరంలేదు" అంది శ్రీమతి జానకి.

"మనం చేసే కొత్త ప్రయోగాలకు ... ప్రేక్షకులు ఆమోదముద్ర వేస్తారు, చిత్రీకరణ విధానం నచ్చితే," అన్నారు శ్రీమతి షావుకారు.

"రావణుడే రాముడయితే" స్కోప్ వర్ణ చిత్రాన్ని నిర్మిస్తున్న శ్రీమతి అనురాధాదేవి, తన చిత్రం సంతృప్తికరంగా, జనరంజకంగా వస్తున్నదని, దర్శక ... కథకుడు శ్రీ దాసరిని, కథానాయకుడు శ్రీ అక్కినేనిని అభినందించారు.

"రావణుడే రాముడయితే" స్కోప్ వర్ణ చిత్రంలో శ్రీ అక్కినేని ... లత పాల్గొనే యుగళ గీతాన్ని, గోవాలో చిత్రీకరించనున్నట్టు, నిర్మాణత శ్రీ విజయకుమార్ తెలిపారు.




ఈ ... రంగుల చిత్రంలో అక్కినేని, ... ప్రభాకరరెడ్డి, మోహన్‌బాబు, మాడా, కె. వి. చలం, జయచిత్ర ... లత ... "షావుకారు" జానకి, జయమాలిని, ఉషాచౌదరి, మరియు అల్లురామలింగయ్య ప్రధాన పాత్రధారులు.

శ్రీ దాసరి కథ...మాటలు...చిత్రానువాదం సమకూర్చి, దర్శకత్వం నిర్వహిస్తున్న "రావణుడే రాముడయితే" చిత్రానికి జి. కె. వెంకటేష్, బాలు, వాలి, కె. ఎస్. మణి, రాధాకృష్ణ ... శాస్త్రి ముఖ్య సాంకేతిక సారథులు.

'ఏది పాపం ? ఏది పుణ్యం'లో కె. వి. చలం, సరోజ



# "నా కుటుంబానికి తగిన సంపూర్ణ ఆరోగ్య పానీయం."

ఒక్క
## కాంప్లాన్
మాత్రమే శరీరానికి కావలసిన 23 అతి ముఖ్యమైన ఆహారాలను సంపూర్ణంగా కలిగి ఉంది.



ఒక్క కాంప్లాన్ లోనే, బలం, శక్తికోసం ప్రతి రోజూ శరీరానికి కావలసిన ప్రొటీనులు, కార్బోహైడ్రేట్‌లు, ఖనిజ లవణాలు, విటమినులు, ఇతర ముఖ్యమైన ఆహారాలు శాస్త్రీయంగా కూర్చబడిన పాళ్లలో ఉన్నాయి.

గుర్తుంచు కోండి, సంపూర్ణ పోషణ కోసం డాక్టర్లు కాంప్లాన్‌నే ఎక్కువగా సిఫార్సు చేస్తున్నారు.

కాంప్లాన్ సాధారణ రుచిలోనూ, చాకలెట్, ఏలకికాయ-కుంకుమపువ్వు, పిల్లలు ఇష్టపడే స్ట్రాబెర్రీ వంటి కమ్మని రుచుల్లోనూ కూడా లభిస్తుంది!







# సంపూర్ణమైనది

## కాంప్లాన్ సంపూర్ణ ఆరోగ్య పానీయం

CASGC-38-234 TEL

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.







సైన్సులో సరదాలు

# తగులబడని గుడ్డ

కుళ్లు బట్టని చూపించి, "నిప్పుల్లో వేస్తే తగలబడదు ఈ గుడ్డ" అని చీదరించుకోవడం మీరు వినే ఉంటారు. అది కేవలం అతిశయోక్తే కాని నిజంకాదు. నేను చూపించ బోయేది అటువంటి కుళ్ళు బట్టాకాదు, కేవలం చమత్కారానికి ఉప యోగించే మాటాకాదు.

ఈ గారడీ చెయ్యడానికి : 1. పాత రాగి డబ్బా, 2. పాత జేబు రుమాలు, 3. వెలిగించిన అగరువత్తిగాని సిగరెట్టు గాని.

రాగిడబ్బాను జేబురుమాలులో వేసి, గట్టిగా అంచులు బిగించి పట్టుకో ఇక్కడి బొమ్మలో చూపించినట్లు.

ఇప్పుడు వెలిగించిన సిగరెట్టుగాని, అగరువత్తిగాని తెచ్చి, మండుతున్న చివరను ఆ రుమాలుమీద పెడితే ఏమవుతుంది ?

రుమాలుకాలి చిల్లు పడుతుంది అను కుంటున్నారా ? పడదు. అదే గమ్మత్తు. (అయితే ఈ గమ్మత్తు చేయడానికి పాత బట్టనే ఉపయోగించండి. ఎందుకైనా మంచిది).

బట్ట అంటు కోకుండా ఉండడానికి దానిని ఏ ప్రత్యేక ద్రవంలోనైనా ఇంతకు ముందే ముంచి, ఎండబెట్టి, తెచ్చినట్లు మీ స్నేహితులకి సందేహంగాఉంటె, లోపల పెట్టిన రాగి డబ్బాను తీసేసి, మండుతున్న సిగరెట్టు కొసను పట్టి బట్టమీద పెట్టి చూపెట్టండి ఏమవుతుందో. ఒక్క క్షణంలో బట్టకాలి చిల్లుపడిపోతుంది.

అంటే మన గమ్మత్తుకి ప్రాణం డబ్బా అన్నమాట. "సర్వేగుణాః కాంచన మాశ్రయంతి!"

అయితే రుమాలులో డబ్బాను మూట కట్టడంవల్ల ఏం జరుగుతోంది ?

ఏదైనా వస్తువు మండాలంటే ముందర ఆ వస్తువు ఒక ప్రత్యేకమైన ఉష్ణోగ్రతకు వచ్చేదాకా వేడెక్కాలి. ఆ ఉష్ణోగ్రతకు చేరుకోకుండా ఎంతసేపు వేడిచేసినా మండదు. ఇది అతిముఖ్యమైన సూత్రం.

మండుతున్న సిగరెట్టు కొసనుంచి రుమాలుకి, రుమాలునుంచి రాగి డబ్బాకి వేడిమి ప్రసరిస్తుంది. రాగి, ఇనుము, వెండి, బంగారం, అల్యూమినియం వంటి లోహాలలో మంచి వేడిమి చక్కగా ప్రసరిస్తుంది. కనుక వీటిని ఉష్ణవాహకాలు అంటారు. బట్ట, కాగితం, కర్రవంటి వస్తువులలో మంచి వేడిమి చక్కగా ప్రవహించదు. వీటిని అనుష్ణవాహకాలు అంటారు. సిగరెట్టు కొసనుంచి రాగిడబ్బా తాలూకు అన్ని మూలలకీ వేడిమి చక్కగా, అతి వేగంగా ప్రవహిస్తుంది. కనుక గుడ్డమీద



ఒకే ఒక చోట వేడిమి నిలువ ఉండదు. అందుచేత అక్కడ ఉష్ణోగ్రత తగినంతగా పెరగదు. కనుక గుడ్డ మండదు.

ఇక్కడ రాగిడబ్బాకి బదులు ఏ అల్యూమినియపు వాటైనా వాడకూడదా అని సందేహంకలుగ వచ్చు. అల్యూమినియం కన్న రాగి మరింత చక్కని ఉష్ణవాహకం కనుక రాగిడబ్బాతో గమ్మత్తు బాగా రక్తి కడుతుంది. బట్ట రాగిడబ్బాకి అతుక్కొని ఉండేటట్లు బిగించి పట్టుకోవడం చాలా ముఖ్యం. లేకపోతే బట్టనుంచి డబ్బాకి వేడిమి సరిగా ప్రవహించదు.

—డా॥ మహీధర్ నళినీమోహన్.

# ఎందరి హత్య ?

ఉగాండాలో హత్య చెయ్యబడిన వారి సంఖ్య 3 లక్షలదాకా (ఇంకా ఎక్కువ కూడా) ఉండవచ్చునని ఎమ్నెస్టీ ఇంటర్నేషనల్ సంస్థవారు అంచనా వేస్తున్నారు.

ఈ ఏడాది ఫిబ్రవరిలో లాంగీ, లాహోరీ తెగల వారిని పెద్దపెట్టున చంపటం జరిగిందిట.

ఉగాండా జనాభా ఒకకోటి నలభయి లక్షలు ఉంటుంది. అంటే హతుల శాతం 20 శాతం ఉంటుందన్నమాట.

జనరల్ ఇడీ అమీన్ అధికారులలో తెల్లవారు కొందరు కూడా ఉన్నారని ఉగాండా మానవ హక్కుల సంఘం (బిటన్) కార్యదర్శి శ్రీ క్రిస్పర్ క్వెసినా వెల్లడిస్తున్నారు.

మాజీ ఉగాండా అధ్యక్షుడు డా॥ మిల్టన్ ఒబోటె ఫిబ్రవరిలో ఒక రేడియో ప్రసారం చేశారు. అందులో ఆయన హత్యలని వర్ణించారు.

ఎమ్నెస్టీ ఇంటర్నేషనల్‌వారి నివేదికలో ఉన్న కొన్ని హత్య, చిత్రహింస పద్ధతులు— కళ్ళు పెకలించి మొహంమీద వేలాడేట్టు చెయ్యటం; సుత్తులతో కాళ్ళు, చేతులు, కీళ్ళు, తలలు పగలకొట్టటం; దేహంలోని సున్నితమయిన భాగాలకి కరెంటు తీగలు తగిలించటం వగయిరా.

[గార్డియన్ వార్త]

లేదు సరిత. తనపని తను చేసుకుంటోంది. భర్తతో చెబితే "నీకెందుకు ?"అని తిడతాడని తన మనస్సు నొక్కేసింది. కాని శ్రీదేవిని తీసుకెళ్ళి ఏ శానిటోరియంలోనైనా చేర్పాలన్న ఆరాటం మనసులో నిలవనీయడం లేదు.

సాయంత్రం నాలుగు దాటింది. శ్రీదేవి పాలిట యముడైన నారాయణ బయట చాప వేస్తుంటే కీడునే శంకించింది సరిత మనసు. ఆమె అనుకున్న దానికి తిరుగు లేదన్నట్టు శ్రీదేవిని అక్కడికి చేరుస్తుంటే పై ప్రాణాలు పైనే ఎగిరిపోయాయి. ఆఖరి శ్వాస విడవడానికి సిద్ధంగా వున్న శ్రీదేవిని చూసి బొట బొటా కన్నీళ్ళు కార్చింది సరిత.

బి.కాం. చదివి, ఉద్యోగం చేస్తూ తన ఆర్జన, తన చీము, నెత్తురు అన్నీ ఆ యింటికి ధారపోసి చివరకి ఇంత ప్రగతిని సాధించిన ఈరోజుల్లో సరైన మందులు, వైద్య సహాయం లేక పండంటి పాలికేళ్ళకే తనువు చాలించుకున్న ఆమెని చూస్తుంటే అదే వయసు గల సరిత హృదయం భగ్గున మండిపోతోంది కసి, క్రోధం, నిస్సహాయత్వం, ఏదో ఏదో చెయ్యాలన్న ఆవేశం, ఉద్రేకం, ఏమీ చెయ్యలేని దుర్బలత్వం అన్నీ సరితని నిలువెల్లా కబళిస్తుంటే ఆగ్రహాన్ని ఎక్కడా అణచుకోలేక పోతోంది.

"అమ్మాయ్ సరితా. మన శ్రీదేవి మనల్ని అన్యాయం చేసి పోయిందే" అంటూ అండాళ్ళమ్మ బుడిబుడి దీర్ఘాలు తీయబోతుంటే ఉద్రేకం పట్టలేక "ఆమె చావలేదు. మీరే చంపేశారు" అంటూ ఏదో ఏదో అనేయబోయిన సరితని అననీయకుండా ఆపింది ప్రభాకర్ చేతిదెబ్బ!

## ఓ ఇంటికథ

(18వ పేజీ తరువాయి)

"నువ్వు నోరు మూసుకుని లోపలికి పోతావా లేదా ?" నిప్పులు కురిపిస్తూ అడిగాడు ప్రభాకర్.

"అదేమిటి బావగారూ! ఎందుకు ఆవిడ మీద చెయ్యి చేసుకుంటారు ?" అని అడిగాడు నారాయణ.

"నా యిష్టం. నా పెళ్ళాన్ని నేను కొట్టుకుంటాను. చంపుకుంటాను. అడగడానికి నువ్వెవడివి?" తిరస్కారంగా అడిగాడు ప్రభాకర్.

ఇంక ఆ మాటకి అప్పీలు లేదు గనుక నోరు మూసుకున్నాడు నారాయణ. సరిత కళ్ళనుండి ధారగా కారుతున్నాయి కన్నీరు. కారాలి. ఆ కన్నీరు ఇంకా ఇంకా కారాలి. ఆ కన్నీళ్ళల్లో ఎన్నో అభాగ్య జీవితాలు, ఎందరో అభాగ్యురాళ్ల దీన చరిత్రలు కరిగి మహానదిలా ప్రవహించాలి, ఆ మహానది కట్టలు తెంచుకుని వరద గోదావరిలా విజృంభిస్తూ కనబడిన పల్లెని పట్టణాన్ని ముంచివేయాలి. అప్పుడుగాని అబలల కన్నీటికి ఎంత విలువ వుంటుందో తెలిసిరాదు.

పిచ్చిదానిలా వెక్కి వెక్కి ఏడుస్తున్న సరితని లోపలికి తీసుకువచ్చి తలుపు గడియ వేశాడు ప్రభాకర్.

"సరితా! ఎందు కేడుస్తావు? ఏడ్చి ఏం సాధిస్తావు. ఇది నీ పక్కఇంట్లో జరిగింది కనుక నువ్వు ఇంత బాధ పడుతున్నావు. నీకు తెలియనివి, నీలాంటి సున్నిత మనస్కురాళ్ళు భరించలేనివి లోకంలో ఎన్నో ఎన్నో దారుణాలు జరుగుతున్నాయి. అవన్నీ విని తట్టుకో గలగడానికి నీపాలికేళ్ళ జీవితం సరిపోదు. తలుపులు బిడాయించి ఫాన్ ఆన్ చేసి హాయిగా కాగితం కలం పట్టుకుని నవలలు, కథలు రాసే నీకు ఈ లోకానుభవం సరిపోదు. ఏడ్చి నువ్వేం ఉద్ధరించగలిగావు? ఆ అత్తమీద పోట్లాడుతావు, ఆ నారాయణ మీద అరుస్తావు. నీఆవేశంతో లేనితగాదాలు కొని తెచ్చుకోవడమే గాని పోయిన శ్రీదేవి తిరిగివస్తుందా ? ఇలాంటి అభాగ్యురాళ్ళు ఎందరో వుంటారు ? వాళ్ళనందర్నీ నువ్వు తెచ్చిపెట్టి పోషించగలవా ? నీ తాహతెంత ? మన ఆర్జనెంత ? మనసు దిటవుపరచుకో. కర్మ గతిని ఎవరూ తప్పించలేరుగదా. ఆమె లలాట లిఖితం అలా వుంది. దానికి నువ్వేం చేయగలవు ?" అంటూ చాలాసేపు ఓదార్చాడు సరితని.

"అవును. ఆమె కర్మం అలాంటిది. నాకర్మం ఇలాంటిది. ఏదీచూసి తట్టుకోలేని మనస్సును పెట్టి తన కర్మం ఇలా కాల్చాడా భగవంతుడు. ఏంచేస్తాం. భారత దేశం కర్మభూమి అనుభవించక తప్పదు" అనుకుంది మండే గుండెతో సరిత. కసి, క్రోధం ఆమెలో వెల్లువలా వస్తున్నాయి. గోడమీద వెంకటేశ్వరస్వామి ఫొటో, పక్కనే వున్న గాంధీజీ ఫొటో గాలికి రెపరెప లాడాయి. మహిళామండలి ఎగ్జిబిషన్‌లో ఎట్రాక్షన్ కోసం పెట్టిన రికార్డులోంచి "మానవజాతి మనుగడకే ప్రాణం పోసింది మగువ. త్యాగంలో అనురాగంలో తరగని పెన్నిధి మగువ" అంటూ పుల్ సౌండ్‌లో వినిపిస్తుంటే ఇంక భరించలేక రెండు చెవులూ మూసుకుని మంచం మీద వాలి పోయింది.

# కోర్టులో విచిత్రం

పోలీసులు బహదూర్‌ఖాన్ అనే అతనిని కొట్టి చంపేశారనే అభియోగం మీద ఫతేపూర్‌కు చెందిన బింద్రాము అనే చోట సబ్ డివిజనల్ మెజిస్ట్రేటు విచారిస్తూండగా ఒక వ్యక్తి కోర్టుహాలులోకి హఠాత్తుగా వచ్చి, "అయ్యా నేను చావనూ లేదు. నన్ను పోలీసులు కొట్టి చంపనూ లేదు. నా పేరు బహదూర్‌ఖాన్. నేను బ్రతికే వున్నాను." అన్నాడట.

# తండ్రితల నరికిన బాలుడు!

రాయ్‌గంజ్‌కి చెందిన 40 ఏళ్ళ బుధారిమూది అనే అయన అన్నం దగ్గర కూర్చుంటే ఆయన సతీమణి కాస్త కూర వడ్డించిందట. మరికాస్త అడిగితే కొంచెం విదిలించిందట. దాంతో ఆయనకు కోపం వచ్చి, ఎగిరి గంతేసి, ఆమెను జుట్టు పుచ్చుకుని క్రిందకు తోసేసి దబదబ కర్రతో కొట్టి బాదడం ప్రారంభించాడట. ఈ బాదుడు చూసిన వారి 12 ఏళ్ళ కొడుకు రివ్వున వచ్చి అడ్డగోడంతో తండ్రీ కొడుకులకు ఘోర సంగ్రామం జరిగిందట. ఈ సంగ్రామంలో బుధారిమూది తల తెగి, వ్రేలాడింది రణక్షేత్రంలో పడి, విలవిల తన్నుకుని చనిపోయాడట. ఆ పుత్రుడు క్షత్రియ వంశీకుడై వుంటాడా!

## చెట్లకింద క్లాసులు

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఖమ్మంలోని కాలేజీలో కొన్ని క్లాసులు కేవలం చెట్ల క్రిందనే జరుగుతున్నాయట. అదేమీ సరదా కోసమూ, శాంతినికేతన్ పద్ధతి అమలు కోసమూ కాదనీ, ఆ కాలేజీ కసలు క్లాసులు జరిపేందుకు బిల్డింగే లేదనీ, ఎందరో వచ్చి ఎన్నెన్నో వాగ్దానాలిచ్చి పోతున్నారనీ. అయితే యీనాటికీ అది అరణ్యరోదనమే అయిందనీ ఆ కాలేజీ అన్నదట. కాలేజీ ఎట్లా పెరిగేదు!



## వైస్‌ఛాన్సలర్‌గా విద్యార్థి నాయకుడు!

ఉదయపూర్ విశ్వవిద్యాలయానికి చెందిన ఓ విద్యార్థిని కారణాంతరాలవల్ల బహిష్కరించి, అతని పరీక్ష ఫలితాన్ని నిలిపివేసినందుకు ఆ విశ్వవిద్యాలయం విద్యార్థులు వైస్‌ఛాన్సలర్ మీద విరుచుకు పడితే, అయన పోలీసు సహాయం కోరారట. ఆ విశ్వవిద్యాలయం విద్యార్థుల యూనియన్ లీడరు వైస్‌ఛాన్సలర్ పదవిని తనకు తానే తీసుకుని, యీ రోజునుంచీ నేనే యాక్టింగ్ వైస్‌ఛాన్సలర్నని అన్నాడట. అంతేగాక రిజిస్ట్రారును, డీన్‌నూ కూడా తీసివేసి విద్యార్థినాయకులనే వేసేశాడాయన.

## చిత్తభ్రమణంతో భర్తని హత్యచేసిన భార్య

నెల్లూరు చెందిన దేవన్నగి వుంచనూరుకు చెందిన 70 ఏళ్ళ కుప్పుసామి కొన్నేళ్ళ క్రితం ఒకామెను వుంచుకుని తన 60 ఏళ్ళ భార్య పావాయిని నిరాదరించాడట. వీరికి సంసారాలు చేసుకుంటున్న ముగ్గురు ఆడపిల్లలు, ఒక మగపిల్లవాడూ వున్నారట. భర్త నిరాదరణవల్ల పావాయికి చిత్తభ్రమణం కలిగిందట. తానుంచుకున్నామె చనిపోవడంతో ఆ కుప్పుసామి మళ్ళీ భార్యను చేరదీశాడట. దీనివల్ల ఆమెకు మళ్ళీ స్థితి మామూలయినా, అప్పుడప్పుడు పిచ్చికళలు వస్తూండేవట. అటువంటప్పుడు కొట్లాటలవుతూండేవట. పోయిన్నెల పదకొండో తేదీ రాత్రి తన భర్త అన్నం వడ్డిస్తుండగా ఆమె మనస్సు నిశ్చలత కోల్పోయిందట. దాంతో ఆమె పిచ్చిగా అరవనారంభించిందట. ఈ భాగోతం మామూలే అనుకున్న కుప్పుసామి తలవంచుకుని అన్నం తిననారంభించాడట. పావాయి పిచ్చి తార స్థాయిలో దిగి, హఠాత్తుగా కట్టెలు నరికే గొడ్డలి తీసుకుని తలవంచుకుని అన్నం తింటున్న తన భర్త మెడమీద శక్తివంచన లేని దెబ్బ ఒక్కటి కొట్టిందట. దాంతో అతని తల పుట్టుక్కున తెగి క్రింద పడిందట.

## పరీక్షలో కుమారుని బదులు తండ్రి!

భోగల్‌పూరుకు చెందిన రామ్‌గోపాల్ అనే ఆయన తన సుపుత్రునికి బదులు అతని పరీక్ష తానే వ్రాయనెంచి, పరీక్షహాల్లో కూర్చుని బిరబిర గిలకేస్తున్నాడట. బిహార్ పరీక్ష విద్యార్థి యీతను అనుమానించి ప్రశ్నిస్తే అయన చెప్పే అన్నారట. తనకొడుకు మతరామూ చదువు లేదని, అతను పరీక్ష ప్యాసవడానికింత కన్నా మంచి మార్గం తనకు తోచనేలేదని, అన్నారట కోట్వాలీ పోలీస్టేషనులో.

## ప్రేమకోసం!

మలేషియాకు చెందిన కౌలాలంపూరులో ఓ 117 ఏళ్ళ యౌవ్వనుడు తన ఆస్తి నంతా అమ్మి బ్యాంకులోవున్న డబ్బుసాంతం తీసి, యీ మొత్తం పుచ్చుకుని సైకిలు మీద పదిహేను కిలోమీటర్ల దూరం వెళ్ళి తాను ప్రేమించిన 40 ఏళ్ళ అమ్మాయిని జైలునుంచి విడిపించి, ఆమెను సైకిలెక్కించుకుని తిరిగి అంతదూరమూ సైకిలు తొక్కి యింటికి వచ్చి ఆమెను ముచ్చటగా పెళ్ళి చేసేసుకున్నాడట. ఆయనకది పదిహేడో పెళ్ళిట. మరి ఆమెకో!

## అమెరికాలో అపరాధాలు!

న్యూయార్కులో చట్టం చాలా గట్టి అయిపోయిందట ఇటీవల. చిన్న చిన్న విషయాల క్కూడా దండనేనట. చిన్న పదామరి నిరాకు కలిగించేవి. కారులోంచి నల్లని పొగ వస్తే, ఆ కారు నడిపే వానికి 150 డాలర్లుగాని, పది రోజులు జైలు వాసం గానీ శిక్షట. బస్సులోగాని, రైలులోగాని ట్రాన్సిస్టరు ట్యూను చేస్తే 50 డాలర్లు అపరాధమట. హోటలులో పనిచేసేవారు ఆ టయిములో పొగాకు నమిలితే 250 డాలర్లు అపరాధమట. నిషేధింపబడిన స్థలాలలో కారు హారను మ్రోగిస్తే 60 డాలర్లు ఫైనట. థియేటరులలో సిగరెట్టు కాలిస్తే 500 డాలర్లు అపరాధమట. టాక్సీలో ప్రయాణీకుడు ఎక్కేలోగానే ఎక్కడకు వెళ్ళాలి అని అడిగితే ఆ టాక్సీ డ్రయివరు లైసెన్సు రద్దుచేయబడుతుందట. ఎన్ని ఫైనులో, వెరీ ఫైన్! యా!!



**గోనెలో వెండి కడ్డీలు !**

తిరుపతికొండ ఎక్కుతున్న యిద్దరు కుర్రాళ్ళు మధ్యే మార్గంలో మెట్ల నానుకు నుండే పిట్ట గోడ కవతల పక్క కొంచెం దూరంలో ఒకచోట ఒక గోనెమూట చూసి ఆగిపోయారట. ఆ మూట ఏమిటి? అక్కడ ఎందుకుంది అనే ప్రశ్నలకు సమాధానం రాబట్టడానికి ఆ కుర్రాళ్ళిద్దరూ పిట్ట గోడఎక్కేసరికి యిద్దరు పోలీసులొచ్చి "పడ్తారు" అని హెచ్చరించారట. అయినా వాళ్ళది లెక్క చేయక బజరంగబలినితలుచుకుని ఎగిరి గంతేసేసి, ఆ మూట విప్పి చూస్తే అందులో వెండికడ్డీలు కనుపించాయట. బాలాజీ మహత్యమా! కాదు ఎవరో అక్కడ కావాలనో, మరెందుకో వదిలేసిన ఫలితం!

ఆరోతరగతిలో మావాణ్ణి ఆ చలపతిరావు హెడ్మాష్టరు గారి స్కూల్లో ఏలాగైనా చేర్పించాలి. ఆ స్కూల్లో సీటు దొరికితే నిజంగా అదృష్టమే! అక్కడ సీటు దొరకడమంటే మాటలా? మామూలుగా వాళ్ళ ఫార్మాలిటీ కోసం పెట్టే ఎంటరెన్స్ పరీక్షలో మంచి మార్కులొస్తే మాత్రం సరా?... ఆ తర్వాత పెద్దవాళ్ళ పలుకుబడి వుండొద్దూ?...

వాణ్ణి పరీక్షకైతే తను పంపించ గలిగాడు.

కష్టపడి చదివి తను మంచిమార్కులు సంపాదించుకోగలిగాడు. కాని – అష్టరాల్ సాదా గుమస్తాగాణ్ణి – పెద్దవాళ్ళ మాట సాయం తనెలా సంపాదించగలడు? మంచి మార్కులతో బాటు పెద్ద ఖ్యర మాట సాయం లేకుంటే వాడికి సీటెలా వస్తుందని? సీటు రాకపోతే వాడి చదువు దండగై పోతుందే!?

ఆ స్కూలు కాకుంటే మరోస్కూల్లో సీటు సంపాదించాలి. మరో స్కూల్లో సీటంటూ దొరకొచ్చుగాని—ఆ స్కూల్లోలా ఇంకోస్కూల్లో పిల్లలకి పాఠాలు చెప్పడంలో వుపాధ్యాయులు అంత శ్రద్ధ తీసుకుంటారా? ఏమో?... ఎలాతెలుస్తుంది?...

ఊళ్లో ఎన్నో స్కూళ్ళున్నప్పటికీ చలపతి రావుగారున్న ఆ ప్రైవేటు స్కూలుకే అంత గిరాకి! ఎంతోమంది తనలాగే తమ పిల్లల్ని ఆ స్కూల్లో చేర్పించడానికే తాపత్రయ పడుతుంటారు. అలాతాపత్రయ పడ్డం సహజమే కదా? ఆ స్కూల్లోని పిల్లలు పబ్లిక్ పరీక్షలు ఇస్తే పాసయి పోతున్నారు. నూటికి ఎనభైమందికి మించి పాసవడమంటే మాటలా? ఆ స్కూల్లోని వుపాధ్యాయుల్ని క్రమశిక్షణతో వుండేట్టు చేయడమేగాకుండా భావి భారతానికి పునాది రాళ్ళయిన నేటి బాల బాలికలకి ప్రశస్తమైన పద్ధతిలో పాఠాల్ని బోధించేట్టు చూడ్డం— చలపతిరావుగారి బాధ్యతలన్నింటిలోను అతి ముఖ్యమైనది. అందుకనే వూళ్లోని బడా బడా బాబుల దగ్గర్నుంచి తనలాంటి మధ్య తరగతి కుటుంబీకులు కూడా తమ పిల్లల్ని ఆస్కూల్లోనే చేర్పించడానికి తహతహలాడు తుంటారు.

ఆ స్కూల్లో చదువు చెప్పే విధానం ఎంత బావున్నప్పటికీ —పిల్లల్ని స్కూల్లో




# పరోక్ష మార్గం

సుస్మితా రమణమూర్తి

చేర్చుకునే పద్ధతిలో మాత్రం క్రమశిక్షణ లేకపోవడం తనలాంటి వాళ్ళకి ఇబ్బందిగా వున్నప్పటికీ- ఈ విషయాన్ని పట్టించుకునే నాధుడెవడూ లేకపోవడం నిజంగా శోచనీయం.

ఆ స్కూలు అభివృద్ధికి ఎప్పుడో సల్ల ధనాన్ని విరాళాలిచ్చిన దాతలే చాలాకాలం నుంచి తెరవెనుగ్గా పిల్లల సీట్ల వ్యవహారంలో అక్రమంగా అనీతిగా ఆర్జిస్తున్నారని తన లాంటివాడికి తెల్సినా— ఆ పద్ధతిలో తనెలాను సీటు సంపాదించలేడు. వారి పద్ధతి ప్రకారం పరీక్షలో బాగా మార్కులు రాక పోయినా — ఓ అయిదొందలు మనవి కాకుంటే సీటు మనల్నే వెదుక్కుంటూ వస్తుంది. అయినా తన కంతటి ఆర్థిక స్తోమ తెక్కడిది ? చలపతిరావుగారు ఆ స్కూలుకి హెడ్మాస్టరే అయినా- వ్యవహారం వంతా ఆ పెద్దవాళ్ళ అజ్ఞాత హస్తాలే నాసుకుంటున్నాయ్.

ఈ పద్ధతి చలపతిరావుగారికి ఇష్టం లేకున్నా— తను మాత్రం ఆ పెద్ద తల కాయల్ని ఎదిరించలేక— ఎదిరిస్తే తనను ఏ మూలకో బదిలీ చేయించేస్తారేమోనన్న భయం, దిగులుతో తనకేమీ తెలియనట్లు వుంటున్నారు.

ఆ స్కూల్లో ఆరో తరగతి క్లాసులు రెండే వుండటం చాలా ఇబ్బందిగా వున్న మాట నిజమే అయినా— క్రింద ఏడుకంటే ఈయేడు కాస్త నయం. గత సంవత్సరం మరీ ఒక్కటే తరగతి వుండేది. పెద్దవాళ్ళ ప్రయత్నంవల్ల ఈ ఏడాది ఆరో తరగతికి రెండు గదులు కేటాయించేరు. అయినప్పటికీ అన్నిసీట్లూ అనఫిషియల్‌గా పెద్దవాళ్ల పలుకుబడికి ఐపోయాయని- ఆస్కూల్లోని ఓ పంతులిద్వారా తెల్సి- ఆ చలపతిరావు గార్ని స్వయంగా వారింటిదగ్గర కల్సినా ప్రయోజనం లేకపోయింది. మీరు పెట్టిన పరీక్షలో మావాడు పాసయ్యాడు. ఎలాగోలా సీటిచ్చి పుణ్యం కట్టుకోమని- అర్థించి నప్పటికీ లాభంలేక పోయింది. ఉన్న అరవై సీట్లకి- మెరిట్ కుర్రాళ్లకి, పలుకుబడి బాబుల పిల్లలకి అప్పుడే యాభై తొమ్మిది సీట్లు కేటాయించేశారట! ఇక మిగిలిన ఒక్క సీటుకి మా ఆఫీసులో పనిచేస్తున్న సుబ్బా రావు కొడుక్కి రావడానికి చాలా వరకు అవకాశా లున్నాయట!?... కారణం మా సుబ్బారావు మాజీ యంపీ దగ్గర్నుంచి ఏదో వుత్తరం తీసుకొచ్చాడట! సుబ్బారావింకా తన కొడుకుని స్కూలుకి తీసుకు రాలేదట! లేకుంటే ఈపాటికే ఆ సీటుకూడా ఐపో యుండేదట! ఆరోక్లాసు సీటుకి 'ఎంపి'గారి రికమండేషన్ !!!

మొదట నమ్మలేక పోయాను. చలపతి రావులాంటి హెడ్మాస్టర్‌గారు చెప్పబట్టి నమ్మాల్సొచ్చింది.

ఆ స్కూల్లో మావాడు చేరాలంటే తనా సీటు ఎలాగోలా సంపాదించే మార్గం చూడాలి. ఆ సీటొస్తే వాడి చదువు ఓ గాడిలో పడుతుంది. పబ్లిక్ పరీక్షలు కూడా ఇట్టే పాసయిపోతాడు. అన్నీ బాగానే ఉన్నయ్! ఐతే సీటు సంపాదించేదెలా?...

సుబ్బారావు 'ఎంపి' రికమండేషన్ సంపాదించాడు.

తనుగన్క మరేదైనా మంచి 'రికమండేషన్' కొట్టిస్తే?... ...

హుఁ! తనముఖం అంత పెద్దోళ్ళ రికమండేషన్ సంపాదించేదే అయితే తనిలా గుమస్తా గిరీతో గింజకోడం దేనికి ? కనీసం హెడ్మాస్టర్‌గారి మాట సాయం కూడా తను సంపాదించలేడు.

ఐతే వాడి సీటుకి... ...

"ఏవిటా రంగనాధం! ఏవిటి నీలో నీవే గొణుక్కుంటున్నావ్ ?" అన్న నా ఆఫీసు మిత్రుడు అప్పలరాజు మాటలకి నా ఆలోచనలు కాస్త పల్చబడ్డాయ్.

మళ్ళీ వాడే అడిగేడు ! "ఇంతకీ మీవాడి సీటు సంగతేవైంది ?"

మావాడి సీటు సంగతి అప్పలరాజు నోటిద్వారా విన్న నాకు-వాడి కొడుకు సంగతి గుర్తొచ్చి, "ఇంతకి మీవాడి సంగతేవైంది ?" అడిగాను.

"ఇంకా ఏమీ తేల్లేదురా! ఆ చలపతి



# వంటలు

## గుమ్మడిపూవు బజ్జీలు

చిటపట చినుకులు పడుతుంటే వేడి వేడిగా ఏదైనా తినాలనిపిస్తుంది. పెరటో గుమ్మడి తీగె వుంటే వర్షకాలం పువ్వుల పూస్తూ అందంగా కనిపిస్తుంటుంది. రెండు పువ్వులు కోసుకుంటే మనకి వేడి వేడి టిఫిన్ తయారవుతుంది.

ముందుగా గుమ్మడి పువ్వుల పురుగు పుటా లేకుండా శుభ్రం చేసుకొని రేకులుగా విడదియ్యాలి. అలాగే శనగపిండి జల్లించి కొద్దిగా ఉప్పు, చిటికెడు సోడా, సన్నగా తరిగిన పచ్చిమిర్చి, కలిపి బజ్జీల పిండి మాదిరి కలుపుకోవాలి. బాణలిలో నూనె కాగాక గుమ్మడి పూవు రేకులను ఒక్కొక్కటి శనగపిండిలో ముంచి నూనెలో వదలాలి. ఎర్రగా వేగాక తీసి పళ్ళెంలో పెట్టాలి. ఈ గుమ్మడి పూవు బజ్జీల వేడిగా తింటే భలే రుచిగా వుంటాయి.

— ముద్దా సరస్వతి

## చిట్టి మిరియాలు

కావలసిన పదార్థాలు :- 1 కప్పు గోధుమరవ్వ (సుజీ), $1\frac{1}{2}$ కప్పులు మైదా, నిమ్మకాయంత వెన్న, 10 గ్రాములు మిరియాలు, 10 గ్రాముల వాము, $\frac{1}{4}$ కిలో డాల్డా కాని, నూనెగాని, తగినంత ఉప్పు.

పురుగు గ్రాలేకుండా మైదా, సుజీ జల్లించి, వాము ఉప్పు వెన్న వేసి బాగా కలిపాలి. తర్వాత నీళ్ళు తగినన్ని పోస్తూ పూరీ పిండికన్న గట్టిగా కలుపుకోవాలి. గోళికాయంత సైజులో ఈ పిండిని చిన్న చిన్న ఉండలు చేసి పెట్టుకోవాలి. రొట్టెల పీటమీద కొంచెం మందంగా వత్తి ఒక మిరియం గింజ మధ్యలో నొక్కాలి. అట్లకాడ మొనతో (సన్నకవేప్ప మొన) ఈ బిస్కట్లకి పొడవాలి. స్టౌమీద వన్నపెగ పైన మూకుడు పెట్టి నూనె కాగనిచ్చి 7, 8 చొప్పున వేసి దోరగా వేయించి తియ్యాలి. చల్లారాక డబ్బాలో పోసి వుంచుకోవచ్చు. ఇవి ఎన్ని రోజులైనా పాడయిపోవు.

— ఎస్. లక్ష్మి.

## అరటిపండు హల్వా

కావలసిన వస్తువులు :- పెద్ద అరటి పండ్లు ఆరు, పంచదార రెండున్నర కప్పులు, నెయ్యి ఒకటింబావు కప్పులు, జీడిపప్పు 50 గ్రాములు. మైదాపిండి ఒకటింబావు కప్పు, వెనిల్లా ఎసెన్సు ఒక టీ స్పూను.

తయారుచేయు విధానము : అరటి పళ్ళకు తొక్కు తీసి, చాకుతో సన్నని బిళ్ళ లుగా ముక్కలు కోయాలి. బాణలిలో సగం నెయ్యిపోసి పళ్ళముక్కలు వేసి వేయించాలి. అయిదు నిమిషాలు వేగాక దించి చల్లార నిచ్చి, ఒక గరిటతో అంతా బాగా నలిపి, మైదాపిండ వేసి కాడతో బాగా కలిపి మళ్ళీ పొయ్యిపై పెట్టాలి. కాస్సేపు కాడతో కలిపి తర్వాత మిగిలిన నెయ్యి, పంచదారపోసి అడుగంటకుండ కలియ పెడుతూ వుండాలి. క్రమంగా పాకం కాస్త గట్టి పడే వరకూ కలియపెట్టాలి. ఇక నేతి వేయించిన జీడిపప్పు, వెనిల్లా ఎసెన్సు వేసి మరో సారి బాగా కలిపాలి. హల్వాలా చిక్క బడ్డాక దించేసుకోవాలి.

— శ్రీమతి గార్ల సరస్వతి.

---

రాజగార్ని ఎంత బతిమిలాడినా లాభం లేకపోయింది. సీట్లన్నీ అయిపోయాయట! మరో స్కూల్లో ప్రయత్నిస్తాను" అన్నాడు అప్పలరాజు.

"ఒక్కసీటు తప్ప మిగతావన్నీ పెద వాళ్ళందరూ తన్నుకుపోయార్రా! ఇక మిగిలిన ఆ ఒక్క సీటుకి మన సుబ్బారావు 'ఎంపీ'గారి దగ్గర్నుంచి వుత్తరం తీసు కొచ్చాడట! ఇంకా వాడి కొడుకు జాయినవ లేదు. వెధవది ఆరోక్లాసు సీటు గురించి ఎన్ని పాట్లురా? నిజంగా రోజులు మారి పోయాయి." నాకు తెల్సిన విషయం వాడి చెవినేశాను.

"మన సుబ్బారావు కొడుక్కి వంట్లో బాగాలేదురా అందుకే ఇంకా చేర్పించలేదు గురుడు పెద్ద పట్టే పట్టాడన్నమాట! ప్రక్కసీటు గణ్ణి నాకే తెలీదు. వాడి రికమండేషన్ వ్యవహారం!? అంటే మంచి రికమండేషన్ గనక్క మనం సంపాదిస్తే ఆ సీటు మనకు రావొచన్నమాట ?"

"మహారాజులా వస్తుంది అయినా

# పరోక్ష మార్గం

అంత పెద్ద 'రికమండేషన్' మనం సంపా దించొద్దూ ?"

"మళీ కలుద్దాంరా!" అంటూ వాడెళ్ళి పోయాడు ఉత్సాహంగా.

* * *

వారం రోజుల తర్వాత అనుకోకుండా బజార్లో చలపతిరావు గారు కన్పించి మావాణ్ణి స్కూలుకి తీసుకురమ్మని చెప్పారు ఎందుకని అడిగితే మా వాడికి సీటిస్తున్నా రని చెప్పారు. ఆ మాట విని మొదట ఆశ్చర్యంతో నోరు తెరిచాను

'ఎంపి' రికమండేషన్ సంపాదించిన సుబ్బారావు కొడుక్కి కూడా ఏ రికమండే షనూ లేని మావాడికి సీటెలా వచ్చిందని వారిని అడక్కుండా వుండలేక పోయాను. దానికి వారు చిన్నగా మందహాసం చేస్తూ ఇలా అన్నారు :

"మొదట మీవాడికి సీటొస్తుందని నేను కూడా అనుకోలేదండీ! మీ ఆఫీసులో పన్చే సున్న సుబ్బారావు - అప్పలరాజు తమ స్వార్థంకోసం తమ పిల్లలకు తెచ్చిన్న రికమండేషన్సే పరోక్షంగా మీవాడికి సీటొచ్చే లాగా చేశాయ్!"

వారు చెప్పింది అప్పటికి అర్థంగాక అయోమయంగా వారి ముఖంలోకి చూడ్డంతో మళీ వారే విషయాన్ని వివరించి చెప్పేరు. అప్పలరాజు కూడా ఓ మాజీ 'ఎమ్. ఎల్. ఏ.' గారి రికమండేషన్ తీసుకొచ్చాడట !!

ఒక్క సీటు! ఆ ఒక్క సీటుకి-

సుబ్బారావుది-'ఎంపీ'గారి రికమండేషన్!

అప్పలరాజుది-'ఎమ్. ఎల్. ఏ.' గారి రికమండేషన్!!

ఆ ఒక్క సీటు ఎవర్ని కాదని ఎవరి కిచ్చినా బాగుండదని-

చివరికి ఇద్దర్నీ కాదని మావాడికి ఆ సీటివ్వడం జరిగిందట!!

విషయం అర్థమవ్వైన నేను ఆశ్చర్యంతో మరోసారి నోరు తెరచి ముక్కుమీద వేసు కున్న వేలు తీయడమే మరిచాను.

# హైదరాబాదు నోట్‌బుక్

## అపూర్వ బృందగానం :—

హైదరాబాద్ లలితకళా కల్చరల్ అసోసియేషన్ ద్వితీయ వార్షికోత్సవం సందర్భంగా అక్టోబర్ 29న రవీంద్రభారతిలో జరిగిన సమావేశం సాంస్కృతిక కార్యక్రమంలో 200 మంది కీస్ గర్ల్స్ హైస్కూలు విద్యార్థినులు ప్రముఖ చలనచిత్ర సంగీత దర్శకుడు శ్రీ ఎం.బి. శ్రీనివాసన్ దర్శకత్వాన బృంద గానం చేసి, శ్రోతలను అపూర్వంగా అలరించారు. శ్రీ డి. రాజేశ్వరరావు దర్శకత్వాన పిల్లలు ప్రదర్శించిన భక్త మార్కండేయ నాటకం, శ్రీమతి ఉమారామారావు దర్శకత్వాన జరిగిన పిల్లల శంకరాభరణం నృత్యనాటిక, జానపద నృత్యాలు ఆకర్షకంగా ఉన్నవి. వార్షికోత్సవానికి అధ్యక్షత వహించిన సమాచారశాఖ డైరెక్టర్ జనరల్ డాక్టర్ ఎ.ఆర్. బాజీ ప్రసంగిస్తూ, "నేను నా మనమడితో సమానంగా బాలుణ్ణయితే బాగుండును" అన్నారు. ముఖ్యాతిథి, మంత్రి వర్యులు శ్రీ టి. హయగ్రీవాచార్యులు ప్రసంగిస్తూ, సాంస్కృతిక కార్యక్రమాలకు రవీంద్రభారతి తప్ప మరొక రంగస్థలం లేదని, మరొక దాని నిర్మాణానికి డాక్టర్ బాజీ ప్రయత్నించాలని అన్నారు. ఈ సందర్భంలో సన్మానితులైన "బాల బంధు" శ్రీ బి.వి. నరసింహారావు అభినందన సంచికను మంత్రి ఆవిష్కరించారు. శ్రీ బి. వి. నరసింహారావును బాలల అన్నయ్య శ్రీ న్యాయపతి రాఘవరావు అసోసియేషన్ పక్షాన సన్మానించారు. కీస్ గర్ల్స్ హైస్కూలు గౌరవ కార్యదర్శిని శ్రీమతి భాగ్యలక్ష్మీనటరాజన్, చలనచిత్ర సంగీత దర్శకుడు శ్రీ ఎం.బి. శ్రీనివాసన్ బాలబాలికల మనోవికాసాన్ని గురించి ప్రసంగించారు. అసోసియేషన్ కార్యదర్శిని శ్రీమతి లలితావరం రచించిన "పిల్లల నాటికలు" పుస్తకం ఆవిష్కరణ కూడ జరిగింది. శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి శ్రీ నరసింహారావుకు సమర్పించిన అభినందన పత్రం చదివారు. ప్రారంభంలో అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ డి. రాజేశ్వరరావు స్వాగతం చెప్పారు. చివర శ్రీ వి.ఎస్. శర్మ ధన్యవాదాలు సమర్పించారు. సాయంత్రం 6-15 కు ఆరంభం కావలసిన సమావేశం 7-00 గంటలకు ఆరంభమయింది. 8-30 వరకు ప్రసంగాలు జరిగాయి.

## గవర్నర్ హితవు :—

మానవసేవలో యువకులు ప్రధాన పాత్ర వహించాలని గవర్నర్ శ్రీ కె.సి. అబ్రహాం అక్టోబర్ 15న క్రైస్తవ విద్యార్థుల బహిరంగ సభలో హితవు చెప్పారు. ఈ బహిరంగ సభ భారత మార్ గ్రెగోరియన్ ఆర్థడాక్స్ స్టూడెంట్స్ మూవ్‌మెంట్ ఆరవ దక్షిణమండల సమావేశాల సందర్భంగా జరిగింది. నవసమాజస్థాపన కార్యక్రమాలలో చురుకుగా క్రైస్తవులు పాల్గొనాలని ఆయన కోరారు.

## శ్రీ కె.ఇ. జోన్ మాయాలోక్— ఇంద్రజాలం :—

ఇంద్రజాలానికి భారతదేశం అనాదిగా పెట్టింది పేరు. సర్కార్ భారతదేశానికి పెద్దకీర్తి తెచ్చిన ఇంద్రజాలికుడు. తెలుగునాడుకేగాక, భారత దేశానికి కూడా విశ్వవిఖ్యాతి తెచ్చిన 92 సంవత్సరాల ప్రొఫెసర్ టి. రాజేంద్రకుమార్, మూడు దశాబ్దాలయినా నిండని శ్రీ బి.వి. పట్టాభిరామ్ మున్నగువారున్నారు. అక్టోబర్ 20న గాంధీ భవన్ ఆడిటోరియంలో కేరళ ఇంద్రజాలికుడు శ్రీ కె.ఇ. జోన్ తమ మాయాలోకంలో గొప్ప విచిత్రాలు చూపి ప్రేక్షకులను దిగ్భ్రాంతులను చేశారు. ఈ ప్రదర్శనానికి పోలీస్ కమిషనర్ శ్రీ పి.వి. పవిత్రన్ ముఖ్య అతిథిగా వచ్చి, 'శుభాకాంక్షలు తెలిపారు. శ్రీ జోన్ ప్రదర్శనలో పడుకున్న మనిషిని శూన్యంలో నిలబెట్టడం, ప్రేక్షకులనుంచి గడియారాలు తీసుకొని, వాటిని ఇరవై సంచులలో వేసిన డబ్బానుంచి తీయడం, పెట్టెలో ఇద్దరు బాలికలను పెట్టి తాళాలు వేసి, ప్రేక్షకులనుండి రప్పించడం, వరుసగా మూడు కత్తులు నాటి వాటిపై బాలికను పండబెట్టి కత్తులను తీసివేసి శూన్యంలో వుంచడం, బాలికను గెలటిన్‌లో పెట్టి అడ్డంగా కోయడం, సంచిలో ఒక బాలికను వేసి మూటకట్టి తాడుతో బిగించి, బిగించిన తాడు ఉండగానే బాలిక సంచి నుంచి వెలువడడం, నాలుగు వేరువేరు రంగు కర్రలను నాటి, దానిలో ఒకదానికి తనను గట్టిగా పగ్గాలతో కట్టించుకొని, కట్లు విప్పకనే ఆయా కర్రలను మార్చడం, మొదలయిన వాటిని చేసి ప్రేక్షకులకు ఆశ్చర్యానందాలు చేకూర్చారు. కత్తులతో పెట్టెలోని బాలికను పొడుస్తున్నప్పుడు, కత్తులమీద బాలికను పరుండబెట్టి కింది కత్తులను తీసివేసినప్పుడు, పడుకున్న మనిషిని శూన్యంలోకి లేపినప్పుడు ప్రేక్షకులు గాభరాతో నోరు తెరచుకొని చూస్తూండిపోయారు. శ్రీ జోన్, ఆయన బృందం వారు అభినందనీయులు.

## పాత ఎం.ఎల్.ఏ. క్వార్టర్స్‌లో ద్యూత గృహాలు :—

పాత ఎం.ఎల్.ఎ. క్వార్టర్సులో తమకు కేటాయించిన క్వార్టర్సును కొందరు విధానమండలి సభ్యులు జూదంకోసం అద్దెకిచ్చినట్లు. దానివల్ల తక్కిన సభ్యుల కుటుంబాలకు చాల ఇబ్బందిగా వున్నట్లు చాలమంది విధానమండలి సభ్యులు ముఖ్య మంత్రికి, లెజిస్లేటివ్ వ్యవహారశాఖామంత్రికి, విధానమండలి సౌకర్యాల పరిశీలన సంఘం అధ్యక్షునికి, విధానసభ సభాపతికి, విధాన పరిషత్తు ఉపాధ్యక్షునికి విజ్ఞప్తిపత్రం పంపినట్లు తెలుస్తున్నది.

## ఉపశ్రుతి :—

"ఇంటర్ విద్యార్థులు తమకు కూడ సెమిస్టర్ పద్ధతి పరీక్షలు పెట్టమని కోరుతున్నారు మాస్టారూ!" అన్నారు ఒక పాతకాలపు ఉపాధ్యాయుడు నన్ను. "వాను చదివింది సంవత్సరంపాటు ఎలా జ్ఞాపకం వుంటుంది చెప్పండి?" అన్నాను. "పూర్వం 20 ఏళ్ళు చదువూ వాచోవిధేయమై వుండేదట" అన్నారు ఆయన. "ఇది రాకెట్ యుగం. వారం వారం జీతాలిస్తున్నట్టు వారం వారం పరీక్షలు పెడితే ఇంకా మంచిది" అన్నారు అప్పుడే అమెరికా నుంచి వచ్చిన ఒక పెద్ద మనిషి.

—తిరుమల రామచంద్ర



# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే యింధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మోస్తరుగానే మీరు కూడా ప్రతి రోజు ఉత్సాహంగా ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతి ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకోవడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అరవంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ యివ్వండి. ఇది మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు. పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

సంపన్నమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది. ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పౌష్టిక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు: బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి. బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఖచ్చితమైన మార్గం—ప్రతి రోజు.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

B-4575-TEL-1

## బి. యస్. ఆర్. బెంగుళూరు

నాకు 25 సంవత్సరములు. కళ్ళు సరిగ్గా చూడటానికి వీలులేక, ఏదో అడ్డం వచ్చినట్టుగా వుంటుంది. ఒక్కొక్కసమయములో ఎక్కువగానొప్పి వుంటుంది కొద్దిసేపు కళ్ళుమూసుకొని పడుకుంటే కళ్ళు మామూలుగా కనిపిస్తాయి. తలదిమ్మెక్కినట్లయి, వాంతి అయినపుడు సుఖంగా వుంటుంది.

ఈ లక్షణాలు "గ్లాకోమా" లేక మెదడులోని భాగములలో కొన్ని మార్పులను సూచిస్తున్నాయి. తలదిమ్మెక్కటం. వాంతులు, కళ్ళుమసకలు కంటినిచేరే నరాలు వత్తిడి చెందటంవల్ల కావచ్చును లేక కంటిలోని "ఎక్వియస్‌హ్యూమర్" యొక్క పీడనము ఎక్కువ అవటంవల్ల గూడా రావచ్చును. మీరు వెంటనే నేత్రవైద్యులను, న్యూరో ఫిజీషియన్‌లను సంప్రదించండి.

## బి. ఎ. ఎల్. హైదరాబాద్

నాకు, మావారికి "లాంగ్‌సైట్" వున్నది. ఇద్దరమూ కళ్ళజోడు వాడుతున్నాము. మాకు ఒక పాపవున్నది. ఈ దృష్టిలోపం పాపకుగూడా వస్తుందా?

మీ ఇద్దరికీ దృష్టిలోపం వున్నప్పుడు మీ పాపకి తరచు చూపు పరీక్షచేయించటం మంచిది. ఎక్కువగా ఇద్దరికీ వున్నప్పుడు పిల్లలకు తొందరగా ఈ దృష్టిలోపం రావటానికి అవకాశము ఎక్కువ.

## డి. టి. ఆర్. నాగర్ కర్నూల్

నా వయస్సు 25 సంవత్సరములు 5 సం॥ల క్రితం టి.బి. వచ్చినది వైద్యం చేయించుకున్నాను. ఇది మరలా వస్తుందా, వివాహం చేసుకోవచ్చునా?

టి.బి. వచ్చినపుడు పూర్తిగా నయమయ్యేదాకా అంటే వైద్యులు వ్యాధి నయమయింది




అని చెప్పేదాకా మందులువాడాలి. మందులు కనీసం 1 సంవత్సరంపాటు వాడాలి కొందరికి ఇంకా ఎక్కువ కాలం వాడవలసి వుంటుంది. పూర్తిగా నయమైన తర్వాత మామూలుగా జాగ్రత్తలు తీసుకుంటే తిరిగి రావటానికి అవకాశం తక్కువ. జబ్బునయమైనతర్వాత వివాహం చేసుకోవచ్చును.

పెద్ద పట్టణాలలో బి.సి.జి. వాక్సిన్ దొరుకుతుంది. ఈ జబ్బు వున్నవారు తమ పిల్లలకు పుట్టిన రెండవ రోజునే ఈ వాక్సిన్ వేయిస్తే మంచిది.

## జి. వి. విజయనగరం

మా పాపకి 7 సంవత్సరములు 3 సం॥ల క్రితం నించీ కీళ్ళనొప్పులువున్నాయి ఎక్కువగా జ్వరంవచ్చి ప్రతి కీలూ పట్టుపట్టి వాచినవి. గుండెదడ, పోటువచ్చినది. వైద్యం చేయించగా గుండె నొప్పి కొద్దిగా తగ్గినది. ఇతర లక్షణాలు తగ్గలేదు.

ఈ వ్యాధి రుమాటిక్ ఫీవర్ అయివుంటుంది. ఈ రోగం వున్నవారికి కీళ్ళ నొప్పులు, జ్వరం. గొంతునొప్పి చర్మంలో చిన్నచిన్న దద్దులులాగ లేవటం జరుగుతుంది. అశ్రద్ధచేసినపుడు ఈ రోగం శరీరంలోని ఇతర భాగాలకు ముఖ్యంగా హృదయానికివిస్తరిస్తుంది. అప్పుడుహృదయము. దానిపైన "పెరికార్డియం" అనే పొరలాంటి కొన్ని నిరంతర లోపాలు ఏర్పడతాయి. అప్పుడు గుండె దడ, నొప్పిరావచ్చును.

ప్రస్తుతం మీ పాపకు వ్యాధిలక్షణాలను బట్టి అప్పుడప్పుడూ తాత్కాలిక ఉపశమనంమాత్రమే చెయ్యవచ్చును. పెనిడ్యూర్-ఎల్ ఎ 6, డిడాక్సిన్, దయూరటిక్స్. వైద్యులు వీటిని వాడతారు. హృదయములోని కవాటములకు నిరంతరంగా లోపం ఏర్పడినప్పుడు వైద్యులు వయస్సుని బట్టి ఏర్పడిన లోపాన్ని బట్టి శస్త్రచికిత్సకు ఏర్పాటు చెయ్యగలరు.

## ఎమ్. ఎస్ ఎల్. ఒంగోలు

చిన్న పిల్లలకు లివరు పెద్దదయినపుడు కనపడే లక్షణాలు ఏమిటి? దీనికి ఏమి చెయ్యాలి? ఇది పెద్దవారికి గూడా వస్తుందా?

లివరు వున్నపిల్లలకు కడుపుఉబ్బరం, ఆకలి లేమి, మలబద్ధకం, వాంతులు తరచూ జ్వరం రావటం, ముఖము కాళ్ళు, చేతులు సన్నగావుండి కడుపుమాత్రం పెద్దదిగా వుండటం ముఖ్యమైన లక్షణాలు.

ఇలా రావటానికి ముఖ్యంగా కామెర్లు వచ్చిన తర్వాత, ఎక్కువగా నైట్రేట్ లాంటి పదార్థములువాడినపుడు, ఆహారంలో క్రొవ్వు పదార్థములు ఎక్కువయినపుడు, ఆహారంలోకొన్ని అసాధారణ పదార్థాల వల్ల ఈ లివరు పెద్దది కావటం జరుగుతుంది.

పెద్దలకి గూడా ఈ కారణాల వల్ల లివరు పెద్దదవ వచ్చును, ఎక్కువగా మధుపదార్థములను వుపయోగించేవారికి ఈ జబ్బు తరచు వస్తుంది.

—డా॥ జె. వెంకటేశ్వరరావు

# మీ పాపాయికి బుద్ధి చెప్పినట్లే ఆ జలుబుకూ స్వస్తి చెప్పండి. మందలించండి, ముద్దుచేయండి.




## రబెక్స్

**అంతా మీ ధోరణిగలదే! జలుబుపై ఓ దెబ్బవేసి ముద్దుగా దూరం చేస్తుంది. ఆపైన మీ పాపాయికి ఉపశమనం, హాయి...**

# రబెక్స్

రబెక్స్‌లోని జలుబు నుండి ఉపశమనాన్ని కలిగించే విశ్వసనీయమైన ఆరు ఔషధాలు (మెంథాల్, కేంఫర్, థైమాల్, టర్పెంటైన్, యూకలిప్టస్ ఆయిల్, నట్‌మెగ్ ఆయిల్), మీరు అతని ముక్కుపై, గొంతుకపై, ఛాతీపై, వీపుపై రాయగానే వేడి హాయిని వ్యాపింప చేసి ఉపశమనాన్ని కలిగిస్తాయి. రబెక్స్ త్వరలోనే అతని ముక్కు దిబ్బడను, ఛాతీలో బిరుసును పోగొట్టి హాయిగా ఊపిరి పీల్చుకునేందుకు తోడ్పడుతుంది. మీతోనూ, రబెక్స్‌తోనూ మీ పాపాయిలో నవ్వులు కోకొల్లలు...త్వరలోనే.

**మంటగానీ, అంటుకు పోవడంగానీ లేకుండా జలుబుల నుండి ఉపశమనాన్ని కలిగించే శక్తివంతమైన మలాము.**

**గ్లైకోడిన్ వంటి అధునాతనమైన మందులను తయారుచేసే Alembic అలెంబిక్ ఉత్పాదన**

everest/665/ACW-11




సమయం సాయంత్రం అయిదున్నర గంటలు. పక్షులు గూటికి చేరేవేళ. స్కూలు నుండి పుస్తకాలతో బస్సులతో యుద్ధంచేసి వాడిన ముఖాలతో పిల్లలు తల్లుల దగ్గరకు, ఆఫీసు పక్షులు ఇళ్ళకు చేరేవేళ.

సునీల్ ఆఫీసు నుండి వచ్చి చరిత అందించిన వేడి వేడి కాఫీ తాగి షర్టు విప్పుకుంటూ ఖాళీకప్పుతో లోనికి వెళ్ళబోతున్న చరితను జడపట్టుకుని గుంజేడు.

చరిత "అబ్బా ఉండండి, వచ్చి పది నిముషాలు కాలేదు. అప్పుడే మొదలెట్టారు అల్లరి. పెళ్ళి అయి సంవత్సరం అయింది. ఇంకా కొత్త పెళ్ళికొడుకులా మీరూ మీ చిలిపి చేష్టలూనూ" అంది చిరుకోపంతో.

"మా శ్రీమతి దగ్గర నేనెప్పుడూ కొత్త పెళ్ళికొడుకునే. నీ దగ్గర కాకపోతే ఇంకెవరి దగ్గర చేస్తానోయ్ నేను అల్లరి."

"అయినా నేను మీ గోల భరించలేక పోతున్నానండీ, దయచేసి నన్ను అల్లరి పెట్టకుండా ఇంకెవరి దగ్గరైనా చేయండి మీ చిలిపి చేష్టలూ అవి".

"మీరు రిక్వెస్ట్ చేస్తే మీ మీద గల ప్రేమతో తప్పనిసరిగా మీ కోర్కె మన్నిస్తాం. ఆలోచించి ఆచరిస్తాం" అన్నాడు, చిలిపిగా మొహం పెట్టి సునీల్.

"అబ్బబ్బా మీతో మాట్లాడి నేను నెగ్గలేనుకానీ, ఇంతకీ తమరి కోరికేమిటో చెప్పండి. ఆలోచించకుండా తీర్చేస్తాము" అంది అదే ఫక్కీలో చరిత.

"ఏదీ నువ్వు చెప్పనిస్తేగా. హుషారుగా వచ్చిన భర్తకు ఏం కావాలో కనుక్కోకుండా వాదనలోకి దించి చెప్పాలనుకున్న గుడ్ న్యూస్ చెప్పనివ్వకుండా టైము వేస్టు చేసేసేవు కదా. అయినా చెప్పేస్తున్నాను కాచుకో. మీ నాన్నగారి దగ్గర్నుండి లెటర్ వచ్చింది. మీ చెల్లెలికి పెళ్ళట. మరలా ఆరు నెలల దాకా ముహూర్తాలు లేనందున ఇరవయి రోజుల్లో తగిన ముహూర్తం ఉంటే పెట్టేసేరట. అందుచే నన్ను సపరివార సమేతంగా అంటే నీతో కలసి వెంటనే వచ్చేయమని ఆహ్వానించేరు. చూశావా నీకు ఎంత మంచిన్యూస్ చెప్పేనో మరి నాకు ఏమిస్తావు చెప్పు" అని చరితను చూసేడు.

అప్పటికే తండ్రి వ్రాసిన ఉత్తరం చదివేసి మడత పెడుతూ "మరి మనమెప్పుడు వెళదామండీ" అంది చరిత.

"ఏమిటీ, మనమే. నేను ఇప్పటి నుండీ లీవు అడిగితే ఏకంగా పెర్మినెంట్ లీవ్ శాంక్షన్ చేసేసి పంపించేస్తాడు మా బాస్. అయినా ఇప్పట్నుంచీ ఎందుకులే. పెళ్ళి వారం రోజులు ఉందనగా ఇద్దరం కలసి వెళ్దాములే" అన్నాడు సునీల్. చరిత మరి మాట్లాడకుండా లోనికి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి భర్త పక్కన చేరి ఈలోకాన్ని మరచిపోయిన వేళ రెండు రోజుల్లో తను పుట్టింటికి వెళ్ళిపోవడానికి, పెండ్లి వారముందనగా అతను రావడానికి సునీల్‌ను ఒప్పించింది చరిత.

అనుకున్నట్టుగానే భర్తకు అన్ని జాగ్రత్తలూ చెప్పి బయలుదేరి కన్నవారిల్లు చేరింది. పెళ్ళికి వారంముందుగా వస్తానన్న భర్త రాకపోగా, పెండ్లి ముందురోజు తన ఆఫీసులో పై అధికారుల విజిట్సు కారణంగా తనకు లీవు దొరకలేదనీ రాలేకపోయినం

దుకు బాధ పడవద్దని లెటర్ వచ్చింది సునీల్ వద్దనుండి చరితకు.

పెండ్లి సమయానికి అనుకోని కారణాల వలన డబ్బు చేతికి రాకపోవడంతో ఇస్తానన్న కట్నం డబ్బు పెండ్లి సమయానికి మగ పెండ్లివారికి ఇవ్వలేక పోయాడు చరిత తండ్రి.

"మిగిలినసొమ్ము ఇస్తేనేకాని నాకొడుకు మీ అమ్మాయి మెడలో తాళి కట్టడ"ని తెగేసి చెప్పేసేడు అబ్బాయి తండ్రి.

"ఇప్పుడే మాట నిలబెట్టుకోలేని మనుషులు రేపొద్దున్న పెళ్ళయేక ఏముద్దుముచ్చట్లు జరుపుతారు" అనే వియ్యపురాలి మాటలు విని అవమానంతో తల వంచుకున్నాడు చరిత తండ్రి.

ఉన్నత విద్య నభ్యసించి, ఉన్నత పదవి నలంకరించి కూడా తండ్రి అనే మాటలు వింటూ వ్యక్తిత్వంలేని వ్యక్తిగా తండ్రి చాటు బిడ్డడిగా నోరు మెదపకుండా కూర్చున్న పెండ్లి కొడుకును చూస్తే అసహ్యం వేసింది చరితకు.

నిస్సహాయుడై ఏమి చేయాలో పాలుపోక ఆడపిల్లను కన్న పాపానికి అందరి ముందూ తలవంపులైన తండ్రిని చూసి భరించలేక పోయింది చరిత. తనకు జన్మ నిచ్చి ప్రాణానికి ప్రాణంగా పెంచి విద్య చెప్పించిన తండ్రికి తను ఏవిధంగా సాయపడగలదు అని ఆలోచించింది.

తన వంటి మీది నగలు తీసి మిగిలిన డబ్బుకు బదులుగా నీటిని పెండ్లి వారికి ఇవ్వమని తండ్రికి ఇచ్చింది.

చరిత తండ్రి "వద్దమ్మా ఒక కూతురు బాగుకోసం ఇంకొక కూతురు బ్రతుకులో నిప్పులు పోయలేనమ్మా, ఇది తెలిస్తే అల్లుడుగారు నిన్ను గుమ్మం తొక్కనిస్తారా వద్దమ్మా వద్దు" అన్నాడు.

"లేదు నాన్నా ఆయన అంత కుసంస్కారి కాదు. కన్నతండ్రిని అవసరానికి ఆదుకోవడానికి నా నగలు పనికివచ్చాయంటే సంతోషిస్తారే తప్ప కోపగించుకోరు. వియ్యాలవారికి కావాల్సింది డబ్బేకదా అది విలాతెస్తేనేం దానికోసం ఎంతమంది ఏడిస్తేనేం. ఇన్నాళ్ళూ కొడుకుని పెంచినందుకు వాళ్ళకి కావాల్సింది కిట్టుబాటయ్యే ధర అంతే కదా ఇది తీసుకువెళ్ళి వాళ్ళకి ఇచ్చి జరగాల్సింది జరిపించు. వెళ్ళు నాన్నా వెళ్ళు" అని తండ్రిని పంపించింది చరిత.

నగలు చేతిలో పడగానే వికసించిన ముఖాలతో పెండ్లిలో పాల్గొన్న పెండ్లి వార్ని చూస్తే అసహ్యం, తండ్రిమాట శిరసావహించి తన ధర తానే నిర్ణయించుకుని తనను తానే విక్రయించుకున్న పెండ్లి కొడుకును చూస్తే జాలి కలిగేయి చరితకు.

అటువంటి వ్యక్తితో కాపురం ఏవిధంగా ఉంటుందో, తనచెల్లెలిజీవితం ఏ మలుపులు తిరుగుతుందో అని బాధగా తలుస్తూ భర్త దగ్గరికి ప్రయాణమైంది చరిత.

తను నగలు ఇచ్చేసిన విషయం చెపితే సునీల్ ఏమంటాడో. ఎంత మంచివాడైనా అతనూ అందరిలాటి మనిషే కదా! అనుకుంటూ తనయింటికి చేరింది చరిత.

ఆరోజు రాత్రి జరిగిన సంగతంతా భర్తకు చెప్పి అతని రియాక్షన్ ఎలా వుంటుందో అని చూస్తూ కూర్చుంది.

అంతా మౌనంగా విన్న సునీల్ "చాలా మంచిపని చేశావు చరితా. నిన్ను కని పెంచి నందుకు ఇంత మంచి మనసున్న నిన్ను నాకు ఇచ్చినందుకు వారి కోసం నీవు ఏంచేసినా తక్కువే. నీ నగలు పదిమందిలో నీ తండ్రి పరువు నిలపడానికి ఉపయోగపడ్డాయంటే నాకు చాలా ఆనందంగా ఉంది. స్త్రీలకు అతి ప్రియమైన నగలను నీవు అంత తేలికగా వదులుకున్నావంటే వ్యక్తిగా నీవు ఎంత ఎదిగేవో తెలుస్తోంది" అన్నాడు.

భర్త మాటలు విన్న చరిత అతని విశాల హృదయానికి మనసులోనే జోహారు అర్పించింది.

"ఏమిటో రాణీగారు ఏదో ఆలోచిస్తూ ఈ దాసుని సంగతే మర్చిపోయారు. తమరి కల ఏమిటో మాకు కూడా కొంచెం చెప్పవచ్చుకదా. ఇన్నాళ్ళ విరహం తరువాత కూడా ఈ వంటరి నిద్రేనా" అన్న సునీల్ కొంటె మాటలకు సిగ్గుపడి అతని కౌగిలిలో ఒదిగిపోయింది చరిత.

## త్వమేవశరణం

— దోనేపూడి రాజారావు

దేనా—నేడు
తమోమయ మహా మోహంలో
చిక్కుకున్నాను
రాక్షసుడిలా బ్రతుకుతున్నాను—
సుఖభోగాల్తో కాలి బూడిదై పోతున్నాను
నోట మాట లేదు
కంటి చూపు లేదు
చెవికి వినికిడి లేదు
ఇప్పుడు నేనేం కావాలి
నాకిప్పుడెవరు దిక్కు ?
అంత: కరణంలో దాగున్నావో
వైశ్వానరాగ్ని—వో అత్మన్!
త్వమేవశరణం !
త్వమేవశరణం !!



## ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

### సీరియల్

"రాగద్వేషాలు" రచించిన శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్‌గారి పేరుచెప్పుకో దగినది. ఈ సీరియల్‌లో మొదట రావుగారు బెంగాలీ యువతితో వర్ణాంతర వివాహము జరుప కొన్న విషయము వలన తన కుమార్తె అయిన ఇందిర సంబంధము చెదరినందులకు పెళ్ళికొడుకు అయిన శేఖర్ పూర్వకుం మన స్తత్వాలతో సంబంధము లేకుండా ఆధునికయుగంలో వర్ణాంతర వివాహాన్ని యిష్టపడినందులకు రావుగార్కి ఆరోగ్యము స్థిమితమయినది. అయినను రావు ఎడ్వర్ టైజ్‌మెంట్‌లో పాల్గొని ఇందిరను అమెరికాలో యున్న ఆనంద్‌కు యిచ్చి లక్ష రూప్యములు వరకట్నంగా యిచ్చి చివరికి ఎందుకూ కాని స్థితికి తెచ్చిన ఆనంద్ యొక్క మనస్తత్వము బాగుండలేదు దీనికి గలకారణము మొదట తన తల్లిదండ్రులను తుఫాన్ బీభత్సంలో కోల్పోవుట. రెండోది అతను అమెరికన్ యువతితో తిరుగుటమూలంగా ఇందిరను కష్టాలు పెట్టించినాడు. దీనిని బట్టి ఎడ్వర్ టైజ్‌మెంటులో వధువు కావలెను అని వ్రాయు వారు చాలా దుర్మార్గులు అనబడుతుంది. అంతేగాక ఇందిరకు ఆనంద్ స్నేహితుడు లేకపోతే ఆమెగతి ఏమై పోవాలి ఆమె ఒక్కతే. దీనినిబట్టి వర్ణాంతర వివాహాలు ఇందు చూపించినందులకు చాలా మంచిది ఇందిరను కూడా వర్ణాంతర వివాహము జరిపిస్తే బాగుండేదేమో.

సి. హెచ్. గోవర్ధన్ [మైలవరము.]

* * *

రమణశర్మగారి "ఆకర్షణ - వ్యామోహం" ప్రారంభంలోనే చాలా ఇంటరెస్టుగా వుండి, ముందు మరీ బాగుంటుందనిపిస్తోంది.

శ్రీభూపతిరాజు లక్ష్మీనరసింహరాజు.
[కోడుకొండ.]

* * *

ది 17-11-78 తేదీ ఆంధ్రసచిత్రవారపత్రిక అట్టమీద బొమ్మ "చిన్నారి చిలిపి చూపులు" చాలా బాగుంది. ఈ వారం "ఆకర్షణ-వ్యామోహం" సీరియల్ కథ మమ్మల్ని ఎంతో ఆకట్టుకొంది. ఈ సీరియల్ చదువుతుంటే మేము ఆస్ట్రేలియా చూసినట్లుగావుంది. "బొమ్మల మహాభారతం" ఆకర్షణీయంగా సాగుతోంది.

టి. హేమరాజ్‌సింగ్, సి. అరుణకుమార్
[భువనగిరి.]

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# అమ్మా! నాబూటు ఎంత బాగా మెరుస్తుందో చూడు.



## టింకూ లాంటి బాబు మీకూ వుంటే రీగల్ కావలసిందేమరి! ఇండియాలో అత్యధిక శక్తి గల డిటర్జెంట్ బట్టల సబ్బు.

టింకూ లాంటి పిల్లలు ఉంటే బట్టలు ఉతికే పని అధికం. అందుకు 'రీగల్' మాత్రమే సరయిన డిటర్జెంట్ సబ్బు. 'రీగల్'కుగల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి ఎంతటి మురికినైనా తొలగించి, మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. లోనికి చొచ్చుకొనిపోయి మురికిని తరిమివేయగల–శక్తివంతమైన–నురుగునిచ్చేది 'రీగల్.' ఇతర డిటర్జెంట్ సబ్బులన్నిటికన్న ఎక్కువ ఉతుకులు ఇచ్చే 'రీగల్,' మీకు ఎంతో పొదుపుచేస్తుంది.
'రీగల్'ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.



